**Bharatha Nari**
**(Telugu)**

మారుతున్న విద్యావంతురాలు

# భారత నారి


రచన

మాయిల్ ఖైరాబాదీ

అనువాదం

ఇఖ్బాల్ అహ్మద్

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# భారతీయ మహిళ

## పుస్తక పరిచయం

డాక్టర్ ప్రమీలా కపూర్, 1959, 1960లలో ఢిల్లీ, ఆగ్రాలకు చెందిన విద్యావంతులూ, ఉద్యోగినులు అయిన మహిళలను ఇంటర్వ్యూలు చేసి తీసుకున్న స్టేట్‌మెంట్‌ల ఆధారంగా 'మొహబ్బత్ షాదీ ఔర్ జిన్సియత్' అనే పుస్తకాన్ని సంకలనం చేసి ప్రచురించారు. ఆ మహిళల వయస్సు ఇరవైకి నలభయికి మధ్య ఉంటుందని తెలియజేశారు డాక్టర్ ప్రమీలా కపూర్.

ప్రేమ వివాహాలు, సెక్స్ గురించి మనస్తత్వాలలో మార్పులు ఎలా జరిగాయి? అందుకు కారణాలు ఏమయి ఉంటాయి, వాటి ప్రభావం వల్ల స్త్రీలలో ఇటువంటి పెనుమార్పుకు ప్రేరేపించిన అంశాలేమిటో తెలుసు కోవడమే ఈ ఇంటర్వ్యూల అసలు ఉద్దేశ్యం.

ఇటువంటి ప్రేమలకు కారణాన్ని అన్వేషించడానికి శ్రీమతి కపూర్ గారు విడివిడిగా ఒక్కో మహిళను కలుసుకుని, వారి మనసులోని మాటను తెలుసు కున్నారు. పరిశోధనా ప్రపంచానికి మరింత సమాచారం అంద జేయడం కోసం అన్నట్లుగాకాక ప్రస్తుతం బోధించబడుతున్న విద్య, బోధనా విధానం వల్ల స్త్రీల మనస్తత్వాలపై ఎలాంటి ప్రభావం పడుతుందో పరిశీ లించడమే ఈ ప్రచురణ ముఖ్యోద్దేశ్యం అని ఆమెగారు ఎంతో అన్వేషణా ధోరణిలో తెలియపర్చారు. ఆమెగారు ఢిల్లీ,ఆగ్రాలలో ఇంటర్వ్యూ చేసిన స్త్రీల స్టేట్‌మెంట్లు భారత్ దేశంలోని ఇతర నగరాలలోని స్త్రీల మనోభావాలకు భిన్నంగా ఉండవచ్చు.

కాని స్త్రీలను ఇంటర్వ్యూ చేయడం ద్వారా ఈ స్త్రీల క్రియాత్మక చర్యల ద్వారా విద్యావంతులయిన స్త్రీల ముఖ్యంగా హిందువుల పోకడ ఏ దిశగా మలుపు తిరిగిందో అర్థం చేసు కోవడానికి ఎటువంటి ఇబ్బందీ లేదని మాత్రం కచ్చితంగా చెప్పవచ్చని కూడా ఆమె ప్రకటించారు. డాక్టర్ శ్రీమతి కపూర్‌గారు ఎంతో దూరదృష్టితో వ్యవహరించి, ఆ స్త్రీలు గుర్తింపబడకుండా ఉండేందుకు వారి అసలు పేర్లను మాత్రం బయట పెట్టలేదు. మారుపేర్లతో అందరి స్టేట్‌మెంట్లనూ ప్రచురించే విషయంలో రచయిత్రి ఎంతో జాగ్రత్త తీసుకున్నారు.

డాక్టర్ శ్రీమతి కపూర్‌గారు ఒక విద్యాశాలలో బోధకురాలు. ఆంగ్లభాషలో ప్రసిద్ధ రచయిత్రి. వీరి వ్యాసాలు ఆంగ్లపత్రికలలో ఎంతో గౌరవ పురస్కారంగా ప్రచురించబడుతూ ఉంటాయి. మారుపేర్లతో ఆమె గారు ప్రచురించిన స్టేట్‌మెంట్లను చదివిన వారెవరైనా, ఆమె దృష్టిలోకి వచ్చిన విషయాలకు తన అనుభవాన్ని జోడించి రాశారు తప్ప, అవన్నీ కల్పిత ప్రకటనలే అంటారు. ఈ సందేహాన్ని మేమూ బలపరుస్తున్నాం. అయినప్పటికీ డాక్టరమ్మ గారు వెలువరించిన ఫలితం నూరు పాళ్ళు నిజం. అందుచేత ఆమె గారి పుస్తకాన్ని చదవడం అవసరం అని భావిస్తున్నాం. తద్వారా భారతీయ మహిళల్ని ప్రభావితం చేసిన ప్రేరణల్ని, వారు వంశాచారాల్ని, ప్రాచీన జీవనశైలిని విధానాల్ని వదలి పెట్టడానికి, స్వేచ్ఛాస్వాతంత్ర్యాల వైపు గుడ్డిగా పరుగులు తీయడానికి కారణాలేమిటో అన్వేషించాలి.

ఈ పెనుమార్పుకు దారితీసిన, ప్రేరేపించిన విషయాలు అంటే ఈ మార్పుకు కారణాలేమిటి? ఇందుకు ప్రాథమిక ప్రేరణ కాన్వెంటు, స్కూలు విద్య ఒకటయితే, మరొకటి తల్లిదండ్రుల మమతానురాగాలకు దూరం అవడం అని డాక్టర్ గారు రాశారు. ఆమెగారు ఇలా పేర్కొన్నారు:

"తల్లిదండ్రుల, పిల్లల పరస్పర సంబంధాలు, ప్రాధాన్యత నివ్వవలసిన విషయాలు అని ఆమె భావించారు. ప్రత్యేకించి తల్లి యొక్క మమత, తండ్రి యొక్క ప్రేమాదరణల కొరత (అంటే లేకపోవడం) వంశాచారాల బంధనాలు, జీవనశైలి, జీవిత విధానం ఇతర కారణాలుగా పేర్కొన్నారామె. కనుక

కాన్వెంటు స్కూళ్ళల్లో చదివిన వారి మరియు చదవని వారి ఆలోచనల్లో, ఇద్దరి పెంపకంలో గొప్పతేడా కనిపిస్తోంది. పరిసరాల ప్రభావం, వయస్సు, విద్యా సర్టిఫికెట్లు ఇంకా ఇతర ఘనకార్యాల విషయంలో ఇద్దరూ వేర్వేరుగా ప్రభావితమవుతారు. అంటే విద్యావంతురాలయిన స్త్రీలలో సైన్సు దృక్పథాలు, పాశ్చాత్య పత్రికారంగం శృంగారం (సెక్స్) విషయంలో ఆలోచనల్ని, దృక్పథాల్ని తలక్రిందులు చేసేశాయి. (వాస్తవానికి కాన్వెంటు స్కూళ్ళలో విద్యార్జన చెయ్యని స్త్రీలలో ఇటువంటి పోకడలు లేవు) డాక్టర్ కపూర్ గారు ఒక్కొక్క స్త్రీనీ ఇంటర్వ్యూ చేసి తనదైన ధోరణిలో వివరించారు.

ఈమె పేరు లలిత- వయస్సు 32. ఒక గ్రాడ్యుయేటు. అందంగా అలంకరించుకుంది. స్వేచ్ఛాజీవి. ఈమె బాల్యం ఎంతో దైన్యంతో గడిచింది. పరమ ఛాందసులయిన తల్లిదండ్రుల అశ్రద్ధకు గురయింది. ఎన్నో అడ్డంకులు ఏర్పరచారు. లలిత ఇంటికి దూరంగా ఉన్న కాలేజీలో చేరేందుకు అనుమతి కోసం పెద్ద పోరాటమే చేయాల్సి వచ్చింది. కాలేజీలో చేరాక మొట్టమొదటిసారిగా తాను సుఖపడటానికి ఇప్పుడు పూర్తిగా స్వేచ్ఛ లభించినట్లు భావించింది. ఆమె బి.ఏ. పూర్తిచేసి, ఉద్యోగంలో చేరింది. ఆమె ఇల్లు వదలి ఒక హోటల్‌లో నివసించింది. ఆమె ఎందరో యువకులతో స్నేహం చేసింది. ఈ స్నేహాల వల్ల ఆమెకు లభించిన సుఖం కారణంగా, ఆమె యువతీయువకులకు లైంగిక స్వేచ్ఛకు పూర్తి అనుమతి లభించాలని కోరుకుంటోంది. వివాహానికి ముందు సెక్సు జీవితం గడపాలి అంటోంది. అందువల్ల యువతీ యువకులకు సమానంగా సుఖం లభిస్తుందట. ఇక ఆమె గర్వంగా నేనిప్పుడు స్వేచ్ఛాజీవిని అని ప్రకటిస్తోంది. స్వేచ్ఛాజీవి- స్వేచ్ఛాజీవి. ఆమె ఏం చెయ్యాలన్నా సిద్ధంగా ఉంది. నా తల్లిదండ్రులు ఏ విషయాలనైతే పాపం, వాటిని చేయటం అపరాధం అన్నారో - పట్టుపట్టి వాటినే ఇష్టపూర్వకంగా చేస్తాను.

● ఈమె పేరు మోనా. ఎంతో ఆకర్షణీయమైన రూపం. ఆమెను చూసిన వారు ఆమె నుండి కళ్ళను తిప్పుకోవడం కష్టం. 22 ఏళ్ళ పరిపూర్ణ యవ్వనవతి. ఆమె తల్లిదండ్రులు బాగా డబ్బున్నవారు. పాశ్చాత్య సంస్కృతిలో మునిగి

తేలుతున్న వారు. (లలిత తల్లిదండ్రుల వంటి వారు కాదు) తల్లిదండ్రులు స్వేచ్ఛాప్రియులు అవడం చేత మోనాకు అన్ని వయస్సులలోనూ అడుగడుగునా సహకారం లభించింది. అందుచేత ఆమె చిన్నప్పటి నుంచే అన్ని రకాల బంధనాలు కట్టుబాట్లకు దూరంగా పెరిగింది. సీనియర్ కేంబ్రిడ్జి పాస్ అయింది. 'ప్రేమ వివాహాలు, శృంగారం' పై దృష్టి సారించింది. ఈ ఫలితాన్ని గురించి స్త్రీలనే కాక సాధారణ ప్రజానీకాన్ని కూడా భారతనారి భావనా వీచికలు ఎటుగా వీస్తున్నాయో, ఎటువంటి మన భారత దేశం నైతిక పరంగా ఎటువంటి స్థాయికి చేరుకుంటుందో హెచ్చరించింది.

డాక్టరమ్మ గారు హిందూ స్త్రీలపైనే తన దృష్టి సారించారు. ఒకవేళ ఆమె గారు ముస్లిం సమాజంలో అన్వేషించినా ఆమెకు అపజయం ఎదురయ్యేది కాదు. పట్టణ స్త్రీలు రోజురోజుకీ దిగువస్థాయి మాటలను ఇష్టపడుతున్నారని, భౌతిక ప్రియులు అవుతూ పోతున్నారనేది డాక్టర్ ప్రమిలా కపూర్ గారి పరిశోధనా ఫలితం.

మోనా అనుభవంలో లైంగిక సుఖం అనేది ఎంతో అపూర్వమైన శారీరక ప్రక్రియ. మధురానుభూతుల ఖజానా. అయితే అది ఏకపక్షంగా ఉండకూడదు. స్వార్థంతో కూడుకున్నదీ కాకూడదు. అక్రమ లాభం పొందడం, దోచుకోవడం కోసం కారాదు. (మోనా ఇటువంటి అనుభవాల్ని తప్పక గడిచింది. ఈ పదాలు స్వయంగా తనలో అనుభవ ఆడంబరాల్ని వెల్లడిస్తు న్నాయి. మోనా అభిప్రాయంలో వివాహానికి పూర్వం శారీరక అనుభవం ద్వారా ఒక మానవ జంట తాము మానసికంగా, శారీరకంగా పరస్పరం సముచితమైన వారా? కాదా? అన్నది తెలుసుకోవచ్చు. ఇంకా వివాహం తర్వాత కూడా మరింత సెక్సు ప్రయోగం చెయ్యడంలో ఎటువంటి దోషమూ లేదట.

ఇంకా ఆమె ప్రగల్భాలు పలుకుతూ, తన మిత్రులైన పురుషులూ, స్త్రీలలో ఒక జంటలోని ఒకరు (అంటే భర్త) ఇతర స్త్రీలతో సంబంధాలు ఏర్పరుచుకున్నాడు. మరొకరు (అంటే భార్య) ఇతర పురుషులతో శారీరక సంబంధాలు

పెట్టుకుంది. వీరిద్దరూ హాయిగా జీవిస్తున్నారు. వీరిలో కాపట్యం లేదు. చేసే దంతా బహిరంగంగా చేస్తున్నారు. తాము చేస్తున్నది దాపరికం లేకుండా వెల్లడిస్తున్నారు. తర్వాత ఇద్దరి సంతానములోనూ దుర్నడత లేదు. తల్లి దండ్రులలాగే విశ్వసనీయులు, నిష్కపట స్వభావులు.

● ఇకనైనా చెప్పేది వినండి, నైనా వయసు 40 ఏళ్ళు. ఆమె సరిగ్గా మోనా వంటిది. ఆమె 40 ఏళ్ళ వయసుకు చేరేసరికి 30,32 ఏళ్ళ వయసులో ఉన్న బిగువు కాస్తా సడలిపోయింది. శరీరం వదులు కాసాగింది. నైనా కూడా సరిగ్గా మోనాలాంటి అభిప్రాయాలు భావాలతో గడిపింది. ఎన్నో సంవత్సరాలు నవ్వుతూ, తుళ్ళుతూ గడిపేసింది. ఆమె ఎటువంటి ప్రేమ కోసం తపించిందో ఆ ప్రేమ ఆమెకు స్వచ్ఛమయిన ప్రేమను అందించలేకపోయింది. ముప్ఫయి అయిదేళ్ళు వచ్చేసరికి మగవాడు పరమ దుర్మార్గుడు, ఎంతో టక్కరి, అమితమయిన తుంటరి అని ఆమెకు తెలిసొచ్చింది. మగాడు కొత్త పుంతలు తొక్కుతున్న స్వేచ్ఛాప్రియులైన స్త్రీలను ప్రశంసిస్తాడు. అయితే వారిపట్ల గౌరవంగానీ ప్రేమగానీ అతడికి ఏ కోశానా ఉండవు. అతడు శారీరక సుఖం కోసం అర్రులు చాస్తున్నాడు, స్త్రీలతో పశుప్రాయంతో ఆటవికంగా తుచ్ఛ కామంతో ఆటలయితే ఆడుకుంటాడు తప్ప వారిపట్ల ప్రేమగాని, గౌరవం గానీ అతడికుండవు. అతడి ఉద్దేశ్యంలో ఇప్పుడు తన పొందుకోసం పరితపిస్తున్న ఆడది, తన తర్వాత మరుక్షణంలోనే మరో మగాడితో ఇటువంటి ఆకర్షక సంభాషణలు చేయసాగుతుంది. ఇటువంటి స్త్రీలను అతడు మోసగత్తెలుగా, భౌతిక వాంఛలోలుగా, వ్యాపార దృక్పథం కలవారిగా భావిస్తాడు.

నైనా పెళ్ళయిన ఆడది. ప్రస్తుత తరహాకు భిన్నంగా మొదటి తరహా వ్యక్తిని భర్తగా చేసుకోవడం ఘోరం, ఇప్పుడామెకు ఒక పిల్లవాడు ఉన్నాడు. కోరికల విషయంలో, నైనా భావాలు పూర్తిగా మారిపోయాయి. వివాహానికి పూర్వం శృంగారం ఇప్పుడామె దృష్టిలో మంచిది కాదు. (వైద్యసూత్రాల ప్రకారం గానీ, నిజమయిన స్వేచ్ఛాభావాల పరంగా గానీ). ఇప్పుడామె ఇచ్చే సందేశం, ఏ

స్త్రీ కూడా ఏ మగాడికయినా తన శరీరంతో విచ్చలవిడిగా ఆడుకునే అనుమతి ఎంతమాత్రం ఇవ్వకూడదు అన్నదే.

డాక్టర్ ప్రమీలా కపూర్ గారి వివిధ వయసుల స్త్రీలతో ఈ ఇంటర్వ్యూ పుస్తకంలోని అధికభాగం పుటలలో చోటుచేసుకుని ఉంది. స్త్రీలలో యువతులయితే లలిత, మోనాలతో ఏకీభవించేవారే. వారంతా ఈ ఇద్దరు తుంటరీ స్త్రీలకన్నా బాగా స్పష్టంగా తమ భావాల్ని ప్రకటించారు. ఎంత బాగా స్పష్టంగా పలికారంటే డాక్టర్ ప్రమీలా కపూర్ వంటి ప్రపంచాన్ని ఎరిగిన, అనుభవజ్ఞురాలయిన స్త్రీయే దిగ్భ్రాంతికి గురికావలసి వచ్చింది.

ఇక దాదాపు నలభయి ఏళ్ళ వయస్సు వారైతే వారు అంతాచేసి కూడా నైనా వంటి అభిప్రాయాలు కలిగి ఉన్నారు. చివరగా డాక్టర్‌గారు వీరందరి ప్రకటనల్ని వడబోసి ఇలా రాశారు:

అనేక మందికి ఈ పుస్తకంలో ఆశ్చర్యకరమైన అంశం ఏదీ కనిపించదు. అయితే చదువరులను అప్రమత్తతకు దూరంచేసే విషయం అయితే కచ్చితంగా ఒకటుంది. అదేమంటే, స్త్రీల జీవితంలో పురుషుని పాత్ర పైచేయిగా ఉండటం. ఇప్పటికీ అన్నింటికీ సైద్ధాంతిక పరమయిన కొలపాత్ర పురుషుడే. తమ వ్యక్తిగత స్వేచ్ఛాభావాలు ఉన్న సమయానుకూలంగా వ్యవహరించే లలిత, మోనా వంటి స్త్రీలు ఇప్పటికీ పురుషుల నుండి (భర్త అయినా కావచ్చు, చెలికాడయినా కావచ్చు) ఆర్థిక భద్రతను ఆశిస్తున్నారు. పురుషుల ఈద్విముఖ వైఖరితో కూడి ప్రామాణికత (ఇంకా లలిత, మోనాలకు కాక) నైనా మరియు ఆమె అభిప్రాయాలతో ఏకీభవించే స్త్రీలను చాలా విషయాలలో మార్చివేసింది.

డాక్టర్ ప్రమీలా కపూర్ గారి విస్తృతపఠనం, లోతయిన దృష్టి, అపార అనుభవం ఉన్నప్పటికీ ఆమె ఇస్లాం యొక్క దాంపత్య జీవితం గురించి చదివి ఉండి వుంటే ఆమె తన పేరాగ్రాఫ్‌లో 'అర్రిజాలు ఖివ్వామూన అలన్నిసా' (పురుషులు స్త్రీలపై అధికారులు) అన్న మాటను ఉపయోగించి ఉండేవారే.

ప్రత్యక్ష పరిశీలనలు, ఆమెగారి స్వీయ జీవితంలోని వివిధ దశల్లోని అనుభవాలు ఆమెకు ఎన్నో విషయాలు నేర్పాయి. అయినప్పటికీ ఆమె ఇస్లామీ కుటుంబ జీవితం గురించి కూడా లోతుగా అధ్యయనం చేసి ఉండాల్సింది. ఆమె గనుక అలా చేసి ఉంటే లైంగిక విశృంఖలత్వానికి పరిష్కారం లభించి ఉండేదే. అయితే దాని గురించి పుస్తకంలో ప్రాథమికమైన ప్రస్తావన ఎక్కడా చోటుచేసుకోలేదు. 'అయితే మరి కావాల్సింది ఏమిటి?' అని ఎవరయినా ప్రశ్నించవచ్చు. డాక్టర్‌గారి దగ్గర అందుకు ఎటువంటి సమాధానమూ లేనేలేదు. మహాఅయితే ఆమెగారు ఈ విషయం తెలియచేశారు.

'ఈ మహిళలు గడుపుతున్న జీవితంలో సంఘర్షణ, నేరస్వభావం, పురుషుల ఆచరణా ధోరణి కూడ స్త్రీలతోపాటు మారుతూ ఉన్నప్పుడే దూరం కాగలదని అనిపిస్తోంది. ఈ విషయం పురుషుల వైఖరిని తల్లక్రిందులు చేసే విప్లవం కాగలదు. ఎందుకంటే వారు సుదీర్ఘకాలంగా, ఆర్యుల రాక ఆరంభమయినప్పటి ఉండే ఈ పరిస్థితిలోనే కొనసాగుతున్నారు కనుక.

వాస్తవానికి ఈ పేరాగ్రాఫ్‌లో రాయబడిన పదాలలో తడబాటు కనబడుతోంది. ఈ తత్తరపాటును మినహాయించి మేము వారితో పూర్తిగా ఏకీభవిస్తున్నాము. మేము స్త్రీల దోషపూరిత పరిస్థితిని గురించి రాసినప్పుడు పురుషులకు ఇదే చెప్పాము. వారు ఒక ధర్మబద్ధ సిద్ధాంతానికి లోబడి జీవితం గడపనంత వరకూ స్వయంగా వారికే ప్రశాంతత దొరకదు. అటు స్త్రీలూ సంతృప్తిని పొందలేరు. ఫలితంగా మొదట కుటుంబ వ్యవస్థ ఫ్యామిలీ సిస్టం పాశ్చత్య దేశాలలో జరుగుతున్నట్లుగా విచ్ఛిన్నమవుతుంది. ఆ తర్వాత సామాజిక బంధనాలు విచ్ఛిన్నమయ్యాక హిందూ ధర్మంగానీ, ఇస్లామీ సందేశం గానీ ప్రభావం చూపజాలవు.

## ప్రయోగాత్మక వివాహాలు

ఇక మనం ఇంటర్వ్యూ చేసిన యువతులు, స్త్రీల భావాల్ని ఒక్కో శీర్షిక క్రింద విశ్లేషిద్దాం. ఉదాహరణకు ఒక యువతి డాక్టర్ ప్రమీలా కపూర్ ఎదుటకు ఒక ప్రతిపాదన ఉంచింది. అదేమంటే- మన మధ్య ప్రయోగాత్మక వివాహాలను రివాజుగా చెయ్యాలి. దానివల్ల లాభం ఏమంటే మానవ జంట తాము ఒకరినొకరు నిజంగా తగినవారా? కాదా? అన్నది తెలుసుకోవచ్చుట!

"ప్రయోగాత్మక పెళ్ళిళ్ళు" అంటే ఒక అవివాహిత యువతి, ఒక అవివాహిత యువకుడు కొన్ని దినాలపాటు మిత్రత్వం నెరపాలి. ఇద్దరూ అన్ని విధాలా ఒకరినొకరు అర్థం చేసుకోవాలి. ఇద్దరి స్వభావాలకూ సానుకూలత ఉందా? లేదా? ఇద్దరి అభిరుచుల్లో ఎటువంటి భేదం ఉంది? ఈ వ్యత్యాసం దాంపత్య జీవితంలో అపశ్రుతికి కారణం కాదు గదా! అన్నది పరిశీలించాలి. ఇంకా ఈ యువతి తన మిత్రుని రాకతో తన అవసరాలను సంరక్షించుకోగలదా? ఒకవేళ సంరక్షించుకోలేని పక్షంలో అదనపు ఆదాయం కోసం ఆమె ఏం చెయ్యాల్సి ఉంటుంది. చివరగా ఈ మిత్రుడు నపుంసకుడు కాదు కదా? వగైరా విషయాలలో సంతృప్తిని పొందాలి.

ఈ అమ్మాయిని ఇంటర్వ్యూ చేసే సందర్భంలో ఒక్క విషయం మిగిలిపోయింది. ప్రయోగాత్మక పెళ్ళి కోసం ఎంత గడువు నిర్ణయించాలో డాక్టర్ ప్రమీలా కపూర్ గారు ప్రశ్నించి ఉండాల్సింది. అంటే ఈ విశ్లేషణ ఎంత కాలం వరకు చేస్తూపోవాలి? ఇంటర్వ్యూ ఇచ్చే అమ్మాయి తరఫునుండి ఈ ప్రశ్నకు జవాబు లభించి ఉంటే ఎన్నో చిక్కులు వాటంతట అవే విడిపోతాయి. కాని డాక్టరమ్మ గారికి సరిగ్గా సమయానికి ఈ ప్రశ్న తట్టలేదు. ప్రేమ, శృంగారం భారతదేశానికి వచ్చేశాయని ఆమె రాశారు. అంటే ప్రయోగాత్మక పెళ్ళి పాశ్చాత్య దేశాలలో కోర్ట్‌షిప్ పేరుతో సర్వవ్యాప్తం అయింది. దాని గురించి ఇక్కడి యువతులూ ఆలోచించసాగారు.

డాక్టర్ గారు ఇంకా ఏమి రాస్తున్నారంటే, పట్టణాల్లో విద్యాధికులయిన స్త్రీలు ఆచారాలు తమని ఆపితే ఆగిపోయే రోజులు వచ్చేశాయి. అంటే ఈనాటి

విద్యాధికులయిన యువత, వివాహాల విషయంలో ధర్మం, సమాజం అవలంభిస్తూ వస్తున్న ఆచారాలకు కట్టుబడి ఉండటం లేదు. అంటే హిందూ స్త్రీ హిందూ పురుషుని వివాహమాడటం, బ్రాహ్మణ స్త్రీ అయితే బ్రాహ్మణ యువకుని, ఠాకూర్ అయితే ఠాకూర్‌తో, అంటే స్వజాతి పురుషుని వివాహ మాడటం. అంటే కుల మతాల పట్టింపుల నుండి స్వేచ్ఛ పొందింది అన్న మాట.

కుల మతాల బంధనాలను తెంచుకోవడంతోపాటు, తల్లిదండ్రులు, ఇతర సంరక్షకులు తమ ఇష్టప్రకారం, తమ ఇష్టానికి విరుద్ధంగా తమ వివాహాన్ని ఎవరో ఒకరితో పెళ్ళి జరిపించేయడాన్ని కూడ వారు ఇష్టపడటం లేదు.

ప్రయోగాత్మక పెళ్ళి కోసం డిమాండు చేసే గుంపుకి ప్రతినిధి అయిన ఈ అమ్మాయి విషయంలో అప్పుడే మీరొక నిర్ణయానికి రాకండి. ఆమె ఒక సుందర సాదృశ్య ఉద్యానవనానికి పునాది వేయబోతోంది. అందులో భ్రమరం అయిపోయింది. లేక ఆమె భూమిని ఎటువంటి క్షేత్రంగా యోగ్యవంతం చేస్తోందంటే దాని పంటను స్వేచ్ఛగల ప్రతి జంతువూ మేసిమేసి దాన్ని తన గిట్టలతో నలిపి వేయగలిగే విధంగా చేస్తోంది.

నిజానికి ధర్మం మరియు సామాజిక బంధనాల విషయంలో ఆమె అనుభవం నూటికి నూరు శాతం కాకపోయినా ఎనభయి శాతం తప్పక నిజం. స్త్రీకి తన హక్కులను ఇవ్వలేని మతమూ సమాజమూ, ఒక మతం మరియు సమాజంలో ఆమె కుమార్తెగా, భార్యగా తల్లిగా అయితే ఉండవచ్చునేమో గాని, కుమార్తెకు కుమార్తె వాటా తల్లిదండ్రుల ఆస్తిలో తర్కా (భాగం) లభించక పోతే జీవితాంతం అతనితో గడిపి, రక్తమాంసాలు ధారపోసి భార్యకు తన భర్త ఆస్తిలో ఏమీ లభించకపోతే, ఇంకా తల్లికి వృద్ధాప్యంలో తన మాతృత్వపు హోదాను కొనసాగించడానికి ఆమెకు హక్కు దక్కకపోతే, బాలికలు తమ ధర్మం గురించి తెలుసుకోకపోయి, సామాజిక ఒత్తిడికి అణిగి ఉన్నంతకాలం ఇటు వంటి మతం సమాజం విధించిన కట్టుబాట్లు ఆమెను ఇనుప వలలో బాగా దృఢంగా ఉంచవచ్చు. కాని ఓ విద్యావంతురాలయిన స్త్రీ ఇటువంటి వలను

పీలికలు చేసేందుకు తప్పక ప్రయత్నిస్తుంది. ఆమె చేసే ఈ ప్రయత్నం (క్షమించాలి) ధర్మసమ్మతమే. ఈ ప్రయత్నంలో ఆమె పేరుకి హిందూ అయితే కావచ్చు కాని ఆమె నిజానికి ఏ మతానికీ కట్టుబడి ఉండదు. పైగా దైవం అంటేనే విసుగు, చిరాకు ప్రదర్శిస్తుంది.

ఇక తల్లిదండ్రుల విషయానికొస్తే (మాతాపితలు సంరక్షకులు) వారు కులగోత్రాలు, బొట్టు, శారీ వగైరా వివాహ ఆచారాల్లో ఎంతగా బందీ అయ్యారంటే, వారు తమ కుమార్తెకు సంరక్షణ, మార్గదర్శనం చెయ్యలేక పోయారు. ఎందుకంటే వారే స్వయంగా బావిలోని కవులు, బావిలోని ఇతర ఆడమగ కప్పల్ని జంటలుగా చేస్తున్నాయి. పాశ్చాత్య భావనల వెల్లువ మనదేశంలో ప్రవేశించినప్పుడు అవి, మతం మరియు సామాజిక కట్టుబాట్లను కూల్చి వేసింది. కాని ఈ మతాలలో ఒక మతం మా దృష్టిలో ఉంది. అది సిద్ధాంతాలు, దృక్పథాలు మరియు విశ్వాసాలమేరకు కుల వివక్షనీ, ఆచారాల బంధనాల్ని తెంచివేసింది. కాని ఈ మతాన్ని అంగీకరించేవారు దాని సిద్ధాంతాలు, సూత్రాల నుండి మోహం చాటేయడం విచారకరం. ఈ సైద్ధాంతిక మతాన్ని అంగీకరించే విషయంలోనూ వారు ఈ పాశ్చాత్య భావనల వెల్లువలో కొట్టుకుపోతున్నారు. అవును, ఆ సైద్ధాంతిక మతం ఇస్లాంయే. దానిని అంగీకరించేవారు అంటే ముస్లింలు అన్నమాట. ముస్లింలే తమ ఆచరణల ద్వారా తమ ఇస్లాంనే తిరస్కరిస్తున్నప్పుడు ఈ సమస్యకు పరిష్కారం ఇస్లాంలో ఉందని నేనెలా చెప్పేది. ఈనాడు ప్రపంచం ముస్లింలను చూసి ఇస్లాంను గురించి తెలుసుకోగోరుతోంది తప్ప దానికి ఇస్లాం అంటేనే తెలియదు.

డాక్టర్ కపూర్‌గారు ఇంటర్వ్యూను ఒక వర్గానికే పరిమితం చేశారు. ముస్లిం మహిళల్ని కూడ చేర్చి ఉండివుంటే ఈ ఫలితాన్నే వెల్లడించి ఉండేవారు. అయితే ఆమెగారికి ఒక థియరీ చేతికి చిక్కివుండేది. దానివల్ల తన పుస్తకంలో ఈ సమస్యకు పరిష్కారం కూడా సూచించగలిగేవారు. ఇస్లాం సిద్ధాంతాలను సూత్రాలను గనక అమలు పర్చడం జరిగితే, బహుశా మనదేశంలోకి ప్రవేశిస్తున్న చీకట్ల నుండే కాక మరిన్ని చీకట్ల నుండి రక్షించబడటం మాత్రమే కాక

ఆ చీకట్లు వెలుగుతో మారిపోగలవని వివరించి ఉండేవారు. కాని మా వద్ద అటువంటి పరిష్కారం ఉందని సూచించగల ధైర్యశాలి అయిన ముస్లిం ఎవరున్నారని? అయ్యో! తన ధర్మాన్నుండి ముస్లిం దారితప్పి పొయ్యాడే! ఈ దారి తప్పిన ముస్లిం నడవడికను చూసే డాక్టర్ కపూర్‌గారు ఇస్లాం నేర్పేది ఇదే కాబోలు అని భావించి ఉంటారని మనం ఎందుకు అంగీకరించలేక పోతున్నాం?

ఇక మీరే నిర్ణయించండి. మతం, ధర్మం ఇలా క్షతగాత్రమయితే, సమాజం పరిస్థితి ఇలా ఉంటే పాపం తల్లిదండ్రులు మాత్రం ఏం చేస్తారు? ఇంకా కాలేజీలలో కళ్ళు తెరచిన ఆ యువతులు తమ మనసుకు నచ్చినట్లు ఎందుకు చెయ్యరు? సమాజం పట్ల, ధర్మం పట్ల తిరుగుబాటు చేసి తమంతట తాము ప్రయోగాత్మక పెళ్ళిళ్ళు ప్రయోగాలు ఎందుకు చెయ్యరు?

డాక్టర్ గారయితే ఈ యువతుల మనోభావాలను గ్రహించారు. మనసులకు పట్టిన కుష్ఠును బయటకు వెళ్లగక్కారు. కాని వారికి ఎటువంటి సలహానూ ఇవ్వలేదు. వారితో, చూడండి! నలభయి ఏళ్ళ వయస్సుకు చేరే నాటికి మీ భావాలు నైనా భావాలతో ఏకీభవిస్తాయి అని మాటమాత్రం చెప్ప లేకపోయారు.

నైనా కూడా మీ అభిప్రాయాల వంటి అభిప్రాయాలతోనే గడిపింది. ఎన్నో ఏళ్ళు ఆమె ఆడుతూపాడుతూ కాలం వెళ్ళబుచ్చింది. కాని ప్రేమమార్గాన్ని అన్వేషిస్తున్నప్పుడు వారికది దొరకలేదు. ఆమెకు ముప్ఫయి అయిదేళ్లు దాటేసరికి మగవాడు ఫోకిల్లా అనీ, అతడు ఆధునికులు, కొత్త పోకడలు పొయ్యే స్త్రీలను పొగడటం అయితే చేస్తాడు. కాని వారిపట్ల ప్రేమా గౌరవం మాత్రం ఉండవనీ తెలిసొచ్చింది. అసలయిన మానవ సంబంధాల ఆకలితో అలమటిస్తున్న స్త్రీలతో పాశవికంగా పబ్బం గడుపుకుని శృంగారం విషయంలో ఇప్పుడు వారి దృక్పథం మారిపోయింది. ఇప్పుడు వారు వివాహానికి పూర్వం శృంగారం మంచిది కాదు అని అంటున్నారు. ఏ స్త్రీ కూడా మగవానికి తన శరీరంతో ఆడుకునే అనుమతి ఇవ్వకూడదని భావిస్తున్నారు.

డాక్టర్ కపూర్ గారు కూడ ఈ వయసు దాటే వుంటారు. కామవికారంతో ఊగిపోతున్న యువతులు నలభై దాటిన అనుభవం కలవారి విషయంలో, తొమ్మిది వందల ఎలుకల్ని తిన్న పిల్లి పుణ్యక్షేత్రాలకు బయలుదేరినట్లుగా వుందని అనవచ్చు. ఈ భయం వారికి ఒక అనుభవాన్నుండి దూరం చేసింది. నిజానికి అటువంటి అవకాశం మిస్ కాకూడదు.

డాక్టరమ్మ గారు పుస్తకం పూర్తిచేశారు. అచ్చేయించారు. ఆమెగారి పని పూర్తయిపోయింది. అయితే ఆశల ఆరాటంలో కొట్టుమిట్టాడుతున్న అనుభవ శూన్యులయిన యువతుల ఎదుట, వారి కళ్ళు పూర్తిగా తెరచుకోకపోయినా పేలిపోకుండానయినా ఏదయినా పరిష్కారం సూచించగల ప్రతి ఒక్కరి కోసం ఈ పని ఇంకా మిగిలివుంది.

## ప్రయోగాత్మక పెళ్ళిళ్ళ ప్రేరణ

ప్రయోగాత్మక పెళ్ళిళ్ళకు ప్రేరణ, స్త్రీలకు సామాజిక హక్కుల నుండి దూరం చేసిన సామాజిక బంధనాలే. అవి స్త్రీలను సామాజిక హక్కులకు దూరంగా ఉంచాయి. కృత్రిమ జీవిత నమూనాను అందించిన పాశ్చాత్య భావనలు, ఆలోచనలు, జీవితావసరాల్ని, (అదీ ప్రాథమికమైనవి కాక ప్రదర్శనా ధోరణితో కూడినవి) హద్దులేనంతగా ఎంతగానో పెంచేశాయి. అందుకోసం ధనం కావాలి. కూతురు, భార్య, తల్లి, సమాజం నుండి దూరంగా ఉంచితే వారిదగ్గర ధనం ఎక్కడ్నుంచి వస్తుంది. గత్యంతరం లేక వారు ప్రయోగాత్మక పెళ్ళి చేసుకోసాగారు. కాని వారి అసలు లక్ష్యం, వారి ఆశల ప్రపంచానికి వీలయినంత ఎక్కువ ధనం అందించగల మగవాడు ఎవరో చూడాలన్నదే. ఈ ధనాపేక్ష కారణంగా వారు శీలాన్ని, గౌరవాన్ని బండబూతులు తిట్టారు. డాక్టరమ్మ గారు ఇంటర్వ్యూ చేసిన యువతులు ఈ విధంగా అన్నారు:

- కన్యత్వ భావన విషాదకరం.
- వారు స్వేచ్ఛగా లైంగిక సంబంధాలు పెట్టుకునేందుకు ఒక స్త్రీ

యొక్క శారీరక పరమైన కోర్కెకూ పురుషుని కోరికతో సమానంగా హక్కు లభించాలి.

- వివాహం ఒక ఖైదు మరియు చట్టం దీన్ని విధవ చేశారు.
- పెళ్ళి కూడా ఒక రకం వ్యభిచారమే. దీనికి చట్టపర రూపం ఇవ్వ బడింది.
- ప్రేమ, ఒక ఇచ్చిపుచ్చుకునే కొనుగోలు. ఆమె ప్రేమ క్రయవిక్రయాల ప్రణాళిక లేనిదైతే ఆ స్త్రీ పిచ్చి మనిషి.

ఈ భావాల్ని మరోసారి చదవండి. పురి ఎక్కడ తెగిందో చూడండి. ప్రయోగా త్మక పెళ్ళి చేసుకుని స్త్రీ తన భౌతిక ప్రపంచంలో సంపన్నురాలు అయి పోవాలి. పురి తెగేది ఇక్కడే.

లాభనష్టాలు: ప్రయోగాత్మక పెళ్ళి వలన ఒక లాభం ఏమంటే, ఒక పురు షుడు, ఒక స్త్రీ తమకు ఇష్టమయిన జంటగా ఏర్పడగలరు. అందచందాలు చూసుకుని వారు ప్రేమికులు కాగలుగుతారు. సర్టిఫికెట్‌ల ద్వారా విద్యా ర్హతలు తెలుస్తాయి. బ్యాంక్ బాలన్స్‌ను బట్టి ఆర్థిక స్థితి అంచనా వేయవచ్చు. అయితే ఒకరి అభిరుచిని కొలిచే పరికరం ఎక్కడ్నించి తేవాలో ఆలోచించ వలసిన విషయం. ఇక ఈ అభిరుచి మారుతూ ఉంటుంది. ఈ అభిరుచి ఒక తుమ్మెదలా ఒకే పువ్వుతో సరిపెట్టుకోదు. అది ప్రతి పువ్వునుండి మకరందాన్ని గ్రోలే ప్రయత్నం చేస్తుంది. ఇంటర్వ్యూ చేయబడ్డ నలభయి ఏళ్ళు పైబడిన వారి అనుభవం ప్రకారం స్త్రీలు పురుషుల వలన దెబ్బతిన్నారు. వారు తమ శరీరంలోని అత్యంత విలువయిన వస్తువును కూడా ఈ పందెంలో ఓడి పోయారు. తల్లిదండ్రుల నుండి తెచ్చుకున్న డబ్బు, వస్తువులు కూడా పోగొట్టు కున్నారు. పురుషుడు కూడా ఆ స్త్రీని ఇష్టపడుతున్నాడని ఒక స్త్రీ పురుషుని అందచందాలను ఇష్టపడాల్సిన పనేముంది. పురుషుని దృష్టిలో అందచందా లంటే కేవలం ఎర్రగా ఉండటమే కాకపోవచ్చు. అతడు భారత దేశపు అందాన్ని పాశ్చాత్య అద్దంలో చూడగోరితేనో? ఇందుకు జవాబు ఇవ్వబడదు.

ఇద్దరి స్వభావాల్లో సారూప్యం ఉండాలి అనే విషయాన్ని కూడ గమనించండి. ఈ సారూప్యత విషయంలో సరదాకి అమ్మగారూ! మీ స్వభావంలో కోపం ఎక్కువ ఉండి పురుషుడూ కోప స్వభావుడైతే ఇటువంటి స్వభావంతో కూడిన పట్టాలపై జీవితపు బండి ఎలా నడుస్తుంది? అని అడిగితే.... వగైరా...

అయితే స్వభావాల్లో సారూప్యతకు అర్థం ఇది కాదని మీకు తెలుసు. ఇదొక పరిహాసం మాత్రమే. స్వభావంలో సారూప్యత అంటే ఇద్దరి దృక్పథాలలో సామరస్యం అంటే ఇద్దరి ఆలోచన ఒక్కటే కావాలి. జీవితం గడిపే దృక్పథం విషయంలో ఇద్దరిలో సారూప్యత ఉండాలి. తాగుడు పట్ల ఆసక్తి ఉంటే ఇద్దరిలో ఉండాలి. భోజన పానీయాలు, జీవనశైలి, ఒకరికొకరు త్యాగబుద్ధితో వ్యవహరించడంలో ఇద్దరిలో సమత్వం లోపిస్తే దీనిని ఎలా ఆశించగలం? ఆటల విషయంలో ఇద్దరూ ఒకే విధంగా ఆలోచించడం వగైరా....

ఇవి, ఇంకా ఇటువంటి సారూప్యతలు ఎన్ని ఉన్నాయో అవన్నీ సంకల్పాలు, ఆశాభావంతో చెప్పుకోవడం అయితే జరుగుతుంది. కాని ఇవన్నీ ఆచరణలోకి రాగలవా? ఇటువంటి నమూనా సృష్టిలో ఎక్కడయినా ఉండి ఉండవచ్చు. లేకపోతే వీరిలోని అనుభవజ్ఞురాంద్రయిన స్త్రీలు ఇవన్నీ కోరికలు అని తెలిపారు. ఇంటర్వ్యూలో ఎందరో స్త్రీలు తెలిపారు. వారి మాటల్ని గమనించండి-

ఒక స్త్రీ ఒక సమగ్రమైన ప్రేమను అన్వేషిస్తుంది. (అంటే తాను కోరిందంతా పొందగలగాలని) అది ఆమెకు ఏ కొద్దో లభిస్తుంది. ప్రయోగాత్మక పెళ్ళిళ్ళ విషయంలో ఇప్పటి వరకు ఎదురయిన అనుభవాలలో సుఖాలను అనుభవించటమే లాభం అనుకుంటే ఎవరయినా దాన్ని సమర్థించవచ్చు. కాని సుఖాలు అనుభవించడంలో అసలు లాభం అనేదే లేదు. తన శారీరక, తన ధనం నష్టమే అంతానూ. చివరకు మిగిలేదేమంటే ఇలాంటి ప్రయోగాలు చేస్తూచేస్తూ దాదాపు నలభయి ఏళ్ళ వయసు వచ్చేసరికి ఆమె శరీర లావణ్యం అంతరించిపోతే వేశ్యగా మారిపోతుందన్నమాట.

ఏ పెళ్ళి ఆరాటంలోనయితే తనను తాను పరీక్షకు గురిచేసుకుంటుందో, అది ఆమెకు దక్కలేకపోయింది. పాశ్చాత్య ప్రపంచంలో వేశ్యావాటికలు సర్వసామాన్యం అయిపోవడం మనం చూస్తున్నాం. పెళ్ళికాని తల్లులకు సౌకర్యాలు కూడ కల్పించబడ్డాయి. పెళ్ళి చేసుకొని ఇల్లు చూసుకుని చల్లగ కాలం గడపటం అనేది కోరిక, కోరికగానే మిగిలిపోయింది. ఇప్పుడు అక్కడ ఉమ్మడి కుటుంబ వ్యవస్థ నామమాత్రంగానైనా లేకపోయింది. కేవలం భార్యాభర్తల సంబంధమే ఉంది. ఆ ఇంట్లో సంతానం ఉండదు.

ప్రయోగాత్మక పెళ్ళి వలన శారీరకంగా కలిగే పెద్ద నష్టం ఒకటి ఏమంటే, ప్రయోగాత్మక పెళ్ళిళ్ళ కాలంలో పురుషుడు, స్త్రీ వేర్వేరు జంటలతో కలుస్తూ ఉంటారు. పాశ్చాత్య వైద్యులు ఏమంటున్నారంటే అప్రయోగాలు స్త్రీ పురుషులకు ఇచ్చిన బహుమానాలు ఏమంటే- గనేరియా, సిఫిలిస్, టి.బి. వగైరా వ్యాధులు. అక్రమ సంతానం, స్వార్థపరత్వం మోసం వగైరా. ఈ బహుమతులు కూడా అధికభాగం స్త్రీల వాటాకే వస్తాయి. అంటే ఈ రంగంలో కూడా స్త్రీలే పురుషుల వలన నష్టపోతారన్నమాట.

ఈ ప్రయోగాన్ని చేసిన జంటలు తమ ఆరోగ్యాన్ని చూసుకుని రోధిస్తున్నారు. విద్యావంతులైన పట్టణ యువతులు ఢిల్లీవారయినా, ఆగ్రా వారైనా ఈ రోగాలు, నైతిక దిగజారుడుతనం నుండి తప్పించుకోలేరు. ఇతరులు వినాశానికి గురవుతూ ఉంటే తనను తాను వినాశాన్నుండి రక్షించుకునేవాడే బుద్ధిశాలి. ఇతరులు నూతిలో పడుతూ ఉంటే తాను కూడ అందులోకి దూకేవాడు పరమ మూర్ఖుడు.

## భర్తల్ని మార్చుకునే పెళ్లిళ్లు

మరికొందరు భర్తల్ని మార్చుకునే పెళ్లిళ్లు కావాలని ప్రతిపాదించారు. ఎందుకంటే మేమంతా కలసిమెలసి నివసించే జంతువులం. అందుచేత ఎవరో ఒక భర్తతోనే మా సంబంధాలు పరిమితమై ఉండకూడదు.

డాక్టర్ ప్రమీలా కపూర్ తన పుస్తకం 'షాదీ, ఇష్క్ ఔర్ జన్సియత్' (వివాహం, ప్రేమ, శృంగారం)లో రాశారు. 'రంగులు మార్చే విద్యావంతులైన భారత స్త్రీలు, వివాహం విషయంలో ఇలాంటి ఆలోచన కలిగి ఉన్నారు.'

ప్రయోగాత్మక పెళ్ళిళ్ళ విషయంలో వాటివలన స్త్రీ పురుషులకు వాటిల్లే సామాజిక, శారీరక నష్టం గురించి రాయడం జరిగింది. భర్తలను మార్చుకునే పెళ్లిళ్ల ప్రతిపాదన నలభై ఏళ్ళు దాటిన అనుభవజ్ఞులయిన స్త్రీల నుండి కాక, ఇరవై, ఇరవై ఒక్క ఏళ్ళగల అనుభవశూన్యురాలయిన ఒక యువతి నుండి వచ్చింది. నలభై, దాదాపు నలభై ఏళ్ళుగల అనుభవజ్ఞులయిన మహిళల ఇంటర్వ్యూ గురించి ప్రయోగాత్మక పెళ్ళిళ్ళు అనే శీర్షిక క్రింద పేర్కొని ఉన్నాము. ఉదాహరణకు నలభై ఏళ్ళ వయసు, అనుభవం గల నైనా ఇచ్చే సలహా ఏమంటే, ఏకకాలంలో ఒకే భర్తతో తన సామాజిక జీవితాన్ని పరిమితం చెయ్యడమే ఉత్తమం.

భర్తల మార్పిడి వివాహం విషయంలో దాని ప్రభావం భారత సమాజంలో ఎలా వుంటుందో చెప్పదల్చుకున్నాం. మానవుడు కోతి నుండి జన్మించాడు. పరిణామక్రమంలో అభివృద్ధి చెందుతూ ఇప్పుడున్న ఆకారంలోకి వచ్చాడు. అతడ్ని మనిషి అని అంటున్నారు. కలసిమెలసి జీవించడానికి కొన్ని సూత్రాలు, విధానాల్ని అవలంభించాడు. అందులో ఒక విధానమే 'పెళ్ళి' అన్న ఊహాగానానికి ఈ అమ్మాయి ప్రభావితురాలయినట్లు తెలుస్తోంది.

వివాహం అంటే స్వంత సోదరుడు, సోదరి కాని ఒక పురుషుడు మరియు ఒక స్త్రీ పరస్పరం సహచరులుగా ఉంటామని, ఒకరి ద్వారా మరొకరు తమ జీవితావసరాల్ని తీర్చుకోవడానికి సహకరించుకుంటామని, కలసిమెలసి జీవించే ఈ సూత్రాలు, విధానాలపై నడిచే ఒక గృహాన్ని నిర్మించుకుంటామని ఒప్పందం చేసుకోవడం.

భర్తల మార్పిడి చేసుకోవాలన్న ప్రతిపాదన తెచ్చిన స్త్రీ, కొంత గడువు తర్వాత భర్తని మారుస్తూ ఉండాలి అని, దీనివల్ల జీవితానికి ఒక కొత్త మలుపు వస్తుందని అంటోంది.

నిశ్చయంగా భర్తని మార్చుకోవడం వలన ఒక కొత్త ఆత్మనుకాక ఒక పైశాచిక కాంక్ష తప్పక జనిస్తుంది. అది కొన్నాళ్ళ తర్వాత చల్లబడిపోతుంది. తర్వాత భర్తను మార్చవలసిన అవసరం ఏర్పడుతోంది. ఈ విధంగా వయ సంతా గడిచిపోతుంది. వయసు పూర్తిగా ఇలాగే గడిచిపోదు. ఆ యవ్వనం మాత్రం కరిగిపోతుంది. ఆ కాలంలో పుట్టిన సంతానం గురించి ఈ అమ్మాయి ఏం నిర్ణయించుకుంటుందో ఆ సంతానం ఏభర్త వల్ల కలిగిందో, వారి జీవిత వ్యవస్థ ఎలా రూపుదిద్దుకోగలదో చెప్పలేం.

మరో విషయం ఏమంటే, భర్తను మారుస్తూ ఉండటం వలన వివాహం విధానాన్ని అమలుజరిపే సామాజిక జీవిత లక్ష్యం పూర్తిగా నెరవేరదు. ఇంకా మనం కోతి సంతానమని, బుర్రలో నాటుకుపోతే మనవల్ల జంతు చేష్టలే చేయబడసాగుతాయి. అదికూడ కోతి నుండి ఆశించదగ్గట్టుగానే అన్నమాట. అంటే స్వంత అన్నాచెల్లెళ్ళలో వ్యత్యాసం మిగిలి ఉండదు. ఈ ప్రయోగాన్ని భర్తమార్పిడి వివాహం లాగా కాదు. శాశ్వత వివాహంగా ఈరాన్‌కు చెందిన వాడైన, మతిచెడిన మజ్దకీ ఒకడు ఈరాన్‌లో ఈరాన్' చక్రవర్తి చేత చేయిం చాడు. కాని అదికాస్తా భంగమయిపోయింది. ఈరాన్ చక్రవర్తి తన సోదరిని వివాహమాడినప్పుడు తానొక పశువు అని అతడికి తోచింది. పశ్చాత్తాపంతో దహించుకుపోయిన అతడు ఆ మజ్దకీని వధించాడు.

పశుప్రవత్తినీ, కోతి చేష్టల్నీ అవలంభించినందువల్ల కలిగే ఒక పెద్దనష్టం మరోటి కలుగుతుంది. ఆ దోషం జంతువులలో అయితే కలగదు కాని మను షులలో మాత్రం తప్పక జనిస్తుంది. ఒక ప్రత్యేక సీజను, ప్రత్యేక పరిస్థితులు, ప్రత్యేక వేళల్లో ఆడ, మగ సంపర్కం జరుపుకోవడం జంతువుల అలవాటు. ఈ ప్రత్యేక పరిస్థితుల్లో, ప్రత్యేక వేళల్లో తప్పితే అవి ఒకదాని వంక మరొకటి కన్నెత్తి కూడా చూడవు. కాని మనుషుల్లో అలాకాదు. మనుషుల్లో గల లక్షణం ఏమంటే ఆడ, మగ కలవటానికి నిర్ణీత వేళలూ లేవు, పరిస్థితులూ వారిని ఆపవు. ప్రత్యేక సీజనూ అంటూ ఏమీ లేదు. అటువంటప్పుడు భర్తలను మార్చుకునే పెళ్ళిళ్ళ వలన రకరకాల రోగాలు పుట్టుకొస్తాయి. జంతువుల్లో

అటువంటి రోగాలు కలగక పోవటానికి కారణం అవి సంగమించడానికి ప్రత్యేక సీజనూ, పరిస్థితులూ ఉండటమే. మనిషి శారీరక పరిస్థితిలోని దోషం, అతడు తన కోర్కెలను కంట్రోలు చేసుకోలేకపోయినట్లయితే అవి చెలరేగుతుంటాయి.

ఆకారణంగా అతడు రక్తంలో ఉద్రిక్త పుడుతుంది. ఈ ఉద్రేకం కాస్తా ఉష్ణసంబంధ వ్యాధులు తదితర సుఖవ్యాధులు కలుగుతాయి. ఇందుకు రుజువు కావాలంటే పాశ్చాత్య దేశాల డాక్టర్ల రిపోర్టుల్ని చూడండి. వాటి ఆధారంగా స్త్రీ పురుషుల విచ్చలవిడి శృంగారం, వారి ఆరోగ్యాల్ని ఎలా నాశనం చేసివేసిందో ఆ డాక్టర్లు తెలియచేశారు. వ్యక్తిగతంగా నేను చూసిన సంఘటన గుణపాఠం గరిపే సంఘటన.

1932లో సీతాపూర్ జిల్లాలోని ఒక ఊరు లాహర్‌పూర్‌లో టీచర్‌గా పనిచేస్తున్నాను. అక్కడ కంపౌండర్ సాదుల్లా ఖాన్ ద్వారా ప్రభుత్వ ఆస్పత్రి డాక్టర్ గారితో పరిచయం కలిగింది. ఆ డాక్టర్ గారు నన్నెంతో అభిమానించే వారు. ఒకరోజు అకస్మాత్తుగా కంపౌండర్ సాదుల్లా ద్వారా మారునాడు ఉదయం 9 గంటలకు ఆస్పత్రికి వస్తే ఒక గుణపాఠం నేర్పే సంఘటనను చూడవచ్చని కబురుపంపారు.

మరునాడు సరిగ్గా 9 గంటలకు నేను ఆస్పత్రికి చేరుకున్నాను. డాక్టరు గారు ఆపరేషన్ రూమ్‌లో ఉన్నట్లు తెలిసింది. నేను అక్కడికి వెళ్ళేసరికి డాక్టర్‌గారు ఒక వ్యక్తికి బొడ్డుక్రింద శరీర భాగాన్ని ఆపరేషన్ చేసే ఏర్పాట్లలో ఉన్నారు. కంపౌండర్ సాదుల్లాతోపాటు మరో కంపౌండర్ కూడ అక్కడ ఉన్నాడు.

ఆపరేషన్‌కు ముందు రోగి మూత్రాన్ని తీయవలసి వుంది. డాక్టర్‌గారు పిచికారీ జొప్పించేటప్పుడు రోగి పెడబొబ్బలు పెట్టాడు. డాక్టర్‌గారు అతడ్ని తిడుతూ, 'ఇప్పుడు కాదు, ఆపరేషన్ అప్పుడు తెలుస్తుంది వ్యభిచారంలోని హాయి ఏమిటో!' అన్నారు. ట్యూబ్ పెట్టిన తర్వాత పిచికారీ గొట్టంలో

మూత్రానికి బదులు, చీము రావడం మొదలయింది. తర్వాత ఏం జరిగిందో, ఏవెూ సీసా ఒక్కసారిగా పగిలిపోయింది. కుళ్ళిన చీము వాసన గదంతా వ్యాపించింది. ట్యూబ్ నుండి చీము నేలపై పడసాగింది. వెంటనే అక్కడొక పాత్ర పెట్టారు. రెండో కంపౌండర్‌కు డాక్టర్‌గారు ఏదో సైగ చేశారు. అతడు ఒక పిచికారీలో ఏదో తెచ్చి దానితో గదిలో మందు చల్లాడు. దుర్వాసన తగ్గిపోయింది. అంటే మాకు దుర్వాసన అనిపించలేదు.

చీము అంతా వెడలాక బొడ్డు కింద వాచిపోయిన భాగంలో వాపు తగ్గింది. ఇక ఆపరేషన్ ఆరంభం. డాక్టర్‌గారు గాటుపెట్టేసరికి కుళ్ళిన మాంసం బయటకు వచ్చింది. తర్వాత ఆయన గాటుకు ఇంటూ ఎక్స్ గుర్తు వేసి కుళ్ళిన మాంసాన్ని తీస్తూ పింగాణీ పాత్రలో వెయ్యసాగాడు.

రోగి పరిస్థితి ఇప్పుడు మాటల్లో వివరించలేం. అతడు పెడబొబ్బలు పెడుతుంటే, డాక్టరు గారు చీవాట్లు పెట్టసాగారు. దాదాపు 40 నిమిషాలకు ఆపరేషన్ పూర్తయింది. అప్పుడు డాక్టరు గారు నాకు ఆపరేషన్ జరిగిన భాగాన్ని చూపించారు. రోగి మర్మాంగం పనికి రానిది అయిపోయింది.

డాక్టర్ గారిని ఏమిటి సంగతి అని అడిగాను. ఆయన తెలిపారు- మిమ్మల్ని పిలవడానికి కారణం, ఈ సంఘటనను చూసినట్లయితే గుణపాఠం గ్రహించవచ్చని. ఇతడు పచ్చి వ్యభిచారి. వ్యభిచారం ఇతడు వేశ్యావాటికలకు చేర్చింది. అక్కడ రోజూ కొత్తకొత్త వేశ్యల్ని కలవసాగాడు. వేశ్యలకు సుఖరోగాలు ఉండటం సహజమేకదా! ఆ రోగాల క్రిములు ఇతడి శరీరాన్ని చేరాయి. ఇతడి పరిస్థితి ఇలా తయారైంది. ఇప్పుడు ఇతని జీవితం అయితే దక్కింది. అయితే ఇతడికి జీవితంలో ఏ స్త్రీనీ కలుసుకునే యోగ్యత మిగిలి ఉండదు.

భర్తల్ని మార్చుకునే పెళ్ళివలన ఇటువంటి ఫలితాల్ని ఎవరైనా చూడ దల్చుకున్నారా? ఈ ప్రయోగానికి పూనుకున్న ఏ అమ్మాయీ ఈ ఫలితాన్నుండి తప్పించుకోజాలదు. ఇటువంటి వ్యభిచారం చేసిన మగవాడు కూడ ఈ ఫలితాన్నుండి తప్పించుకోజాలడు.

భర్తల మార్పిడి పెళ్ళిళ్ళ వలన కుటుంబ జీవితం సర్వనాశనమవడంతో పాటు ఆరోగ్యం కూడా నాశనం అవుతుంది. సమాజంలో పాశవిక చేష్టలు వ్యాప్తి చెందుతాయి. ప్రాచీన విలువలు, సిగ్గు, లజ్జ, బిడియం, సౌశీల్యం స్థానంలో, నిస్సిగ్గు, నిర్లజ్జ, వ్యభిచారం వ్యాపిస్తూ పోతాయి. ఈ సిగ్గుమాలిన తనం వలన పురుషుల్లో పశుప్రాయమైన తెగువులూ చోటుచేసుకుంటాయి. వాటిని ఈ జంతువుల ఆడ మగల కలయిక సందర్భాలలో ప్రతివారూ చూడవచ్చు. ఈ విధంగా ప్రభుత్వానికీ తలనొప్పి కొత్తగా పుట్టుకొస్తుంది.

డాక్టర్ ప్రమీలా కపూర్‌గారు, భర్తల మార్పిడి పెళ్ళిళ్ళ అసలు లక్ష్యం స్త్రీని ఆర్థికపరంగా పరిపుష్టం చేయడం కోసమేనని రాశారు. నలభయి ఏళ్ళ నైనా తన అనుభవాన్ని వివరించారు. ప్రయోగాత్మక పెళ్ళిళ్ళు అయినా, భర్తల మార్పిడి పెళ్ళిళ్ళయినా లేక స్వేచ్ఛాసంపర్కం అయినా ఈ అన్ని మార్గాలలో ఎల్లప్పుడూ నష్టపోయింది స్త్రీయే. దానిక్కారణం, మగవాడికి బుద్ధి, నేర్పరి తనం, తనను తాను అదుపులో పెట్టుకునే సామర్థ్యం స్త్రీలకన్నా ఎక్కువ. ఈ సామర్థ్యం కారణంగా మగవాడు స్త్రీ నుండి ధనం గుంజుకున్నాడు. ఏ స్త్రీ అయినా ఈవిషయంలో విజయం సాధించేదేమో నాకు తెలియదు.

చివరిగా, భర్తల మార్పిడి పెళ్ళి వలన ఏదైనా ఒక విధానం, ఒక సిద్ధాంతం ప్రాతిపదికన జీవితం గడపటం అసంభవం అయిపోతుంది. భర్తలు మారి నందువల్ల విధానాలు, సిద్ధాంతాలు మారడమూ అవసరమే. రోజురోజుకీ పద్ధతులు మారడం వలన జీవితం సక్రమం అయ్యేబదులు భ్రష్టమవుతుంది. తద్భిన్నంగా స్వంత సోదరి గానీ, స్వంత సోదరుడు గానీ కానట్టి వేర్వేరుగా, దూరదూర ప్రాంతాలకు చెందిన వారయి ఉంటారు. ఇద్దరూ పెళ్ళి చేసు కుంటారు. విశ్వాసం, నమ్మకం ఒక్కటే అయిన కారణంగా ఇద్దరి విధానాలూ, అభిరుచులు కేంద్రీకరించబడతాయి. నాలుగైదు ఏళ్ళ తర్వాత ఇద్దరూ సంతృప్తిగా ఊపిరిపీల్చుకుంటారు. ఆరంభంలో కాస్తోకుస్తో సంఘర్షణ అపార్థాలు చోటుచేసుకోవడంలో ఆశ్చర్యమేమీ లేదు. అయితే ఈ రగడ త్వరలోనే అంతం అవుతుంది. ఈలోపు వారికి సంతానం కలిగితే ఈ కీచు

లాటలోనూ ఒక విధమయిన ఆనందం పొందుతారు. ఇటువంటి సంతృప్తి, ఆనందం భర్తల మార్పిడి పెళ్ళిళ్ళలో ఎన్నటికీ కలుగదు. మగవాడు పిల్లల విషయంలో అసంతృప్తి కలిగి ఉంటాడు గనుక. ఇతరుల వలన కలిగిన పిల్లల్ని నేనెందుకు పెంచాలి? అన్న ఫీలింగ్ వచ్చేస్తుంది. ఫలితంగా వేర్వేరు భర్తల వలన కలిగిన సంతానం బాధ్యత తల్లిపై పడుతుంది. అప్పుడు ఆమెకు ఇలా జరిగిందేమిటి? అనేది అర్థమవుతుంది.

ఈ ప్రశ్నకు జవాబు ఆమెవద్ద లేదు. ముసలితనం ఆమెను కాలనాగై కాటేస్తుంది. సంతానం తమతమ దారుల్ని చూసుకుని ఎటో పోతారు.

మేము మరోసారి విచారణాన్ని వ్యక్తం చేస్తున్నాం. డాక్టర్ ప్రమీలా కపూర్ తన భావాల్ని సంకలనం చేసి ఒక విలువయిన పుస్తకాన్ని వెలువరించారు. కాని ఇటువంటి యువతుల స్టేట్‌మెంట్‌ల తర్వాత తగు సూచనలు, సలహాలు ఇచ్చివుంటే దానివిలువ మరింత పెరిగేది. ఆమె అలా చేయగల స్థోమత గలవారే. ఇలా చేస్తే పుస్తకం మరింత విలువను సంతరించుకుని ఉండేది. ఏ పుస్తకం అయినా ధర ఎక్కువ ఉన్నంత మాత్రాన విలువైనది కాజాలదు. నిర్మాణాత్మక సలహాల వల్లే అది అమూల్యమయినది కాగలదు.

## సన్యాసత్వం & బ్రహ్మచర్యం

స్త్రీపై, పురుషుని ఆధిక్యత సహజమైనదే. అతను పురుషునిగా పుట్టినందువల్ల జన్మతః వచ్చినదే. అతడి అవయవాలు, కాళ్ళూచేతులూ మనో మస్తిష్కాలు వగైరా స్త్రీలకన్నా దృఢంగా పుట్టించబడ్డాయి. అందుకు భిన్నంగా స్త్రీ సుతిమెత్తని శరీరంతో జన్మిస్తుంది. వయసు పెరిగిన కొద్దీ మరింత నాజూగ్గా తయారవుతుంది. అలా రజస్వల అయిన తర్వాత అందచందాలు బొమ్మలా తయారవుతుంది. ఇదంతా స్పష్టపరంగా ఆమెకు లభించింది. ఆమె గనుక తన నాజూకు శరీరం, అందచందాల సోయగాల్ని పురుషుల వంటి శరీరాన్ని పొందాలనుకుంటే, అది సాధ్యం కాని పని. ఈ విషయంలో పాశ్చాత్య స్త్రీలు పురుషునిగా మారాలన్న యావలో డాక్టర్ల సహాయంతో చేసిన ప్రయత్నాలు వారు

ఘోరంగా విఫలం కావటంతో పాటు, తమ జీవితాంతం ఆరోగ్యాన్ని ఎంతగా కోల్పోయారంటే ఆ తర్వాత ప్రకృతి వారిపై జాలి చూపలేదు. పురుషుడుగా మారాలన్న తపనలో వారు తమ ధనాన్నీ కోల్పోయారు. తమ అందచందాల శరీరాన్ని కూడా పాడుచేసుకున్నారు. ఇందులో తాను మగవాడ్ని దెబ్బకొట్టాలని స్త్రీ కోరుతోంది. అసహజ రీతిలో దాని భావం, జీవితం గడిపేందుకు స్త్రీ మరియు పురుషుడు సమాజంలో అడుగిడినప్పుడు హక్కులకు సంబంధించి నంత వరకు మగవాడు వాటన్నింటినీ స్వంతం చేసుకున్నాడు. విధులు అన్నీ కూడ స్త్రీ వాటాకి వచ్చాయి. జీవితాంతం ఆమె విధులు నిర్వహిస్తూ ఉండా ల్సిందే. ఆమెకు మూడు విషయాలలో నష్టం వాటిల్లింది. ఆమె భర్త ఆస్తిలో తర్కా (భాగం) గా ఏమీ పొందజాలదు. తల్లిదండ్రుల ఆస్తిలో వారసత్వపు వాటా లభించదు. ఇంకా సంతానం ఆస్తిలో ఆమెకు ఏమీ దక్కదు.

కుమారిగా ఉన్నప్పుడు ఏమయినా సంపాదించుకుంటే అది తండ్రిది. పెళ్ళి అయిన తరువాత ఏమయినా సంపాదించుకుంటే అది భర్తది. ఆ తర్వాత విధవరాలు అయిపోతే లోబడి ఉండాలి లేదా భర్తతోపాటు అతడి చితిలో దూకిచావాలి. ఇలా చెయ్యకపోతే భర్త వియోగంతో జీవితాంతం తన శరీరం లోని అగ్నిలో మాడుతూ ఉండాలి. సమాజంలో ఎవరైనా ఆమెను గుర్తించడం జరిగితే అపశకునం అన్నమాటతోనే.

ఇటువంటి అసహజమైన జీవితం కోసం స్త్రీని నిశ్చయంగా ఎంతో పతనావస్థకు చేర్చారు. దానితో ఆమె పెళ్ళిచేసుకోకుండా ఉండిపోతే ఏమి టంట? అని ఆలోచించసాగింది. పురుషుడితో వివాహం లేకుండానే గడిపే జీవితం గురించి ఆలోచిస్తోంది. పురుషుని వివాహ మాడకుండా ఒంట రిగా జీవన పోరాటంలో పాల్గొనాలని, తను కష్టించి సంపాదించి ఆర్థికాభి వృద్ధిని దృఢపర్చుకుని ఎవరైనా మగవాడు తన వైపుకు మరలిచూస్తే అతడికి బొటన వేలి సైగచూపాలని భావిస్తోంది.

ఇక్కడ మరో విషయం కూడా చెప్పుకోవాలి. పెళ్ళి పెటాకులు లేకుండా ఉండిపోవాలన్న ఈపోకడ కొత్త ఆలోచనేమీ కాదు. ప్రాచీన కాలంలో ఇందుకు

వ్యక్తిగత ఉదాహరణలు సామాజిక ఉదాహరణలు కూడా ఉన్నాయి. కాని ఈనాటి పోకడలకు, నిన్నటి సిద్ధాంతాలకూ భూమ్యాకాశమంత వ్యత్యాసం ఉంది.

నిన్న అంటే ప్రాచీనకాలంలో బ్రహ్మచారులుగా ఉన్న పెద్దలు గడిచారు. వారి ఉద్దేశ్యం, ఆర్థికంగా పటిష్టత సాధించి పెట్టుబడిదారు అయిపోవాలన్నది కాదు, వారి దృష్టిలో ఈ ధనం మోక్షానికి ప్రతిబంధకం అవుతుంది. ఇంకా తమ శరీరంలో దైవం ఉంచిన శక్తులు తేజస్సు కలిగి వుంటాయి. వారిలో పురుషులు కానీయండి, స్త్రీలు కానీయండి. శరీరంలోని ఇంద్రియాల్ని జయించి, కోరికల్ని అణచి వేశారు. ప్రపంచవాసులతోపాటు వారు నివసించి చూశారు. ఐహిక వాంఛలు వారిని తమవైపుకు ప్రలోభం కలిగించగా వారు అడవులకు వెళ్ళిపోయారు. అక్కడ వారు ప్రాణాలు నిలపుకునే మేరకే ఆహారం స్వీకరిస్తూ జీవితం గడపనారంభించారు.

సామాజిక పరంగా ఈ వైఖరిని అవలంభించిన మహాపురుషులు జీవితాన్ని తమ ఆయుర్థాయాన్ని ఊహించి మూడు దశలుగా నిర్ణయించారు. మాట వరుసకు వారు తమ ఆయుర్దాయం డెబ్భయి ఐదేళ్ళు అని వారు భావించారనుకుందాం. పాతికేళ్ళపాటు తమశరీరంలో కామప్రకోపాన్ని కలిగించే అసలు శక్తిని (ఓజస్సును) అత్యంత పవిత్రంగా సురక్షితంగా కాపాడుకుంటూ జీవితం గడిపారు. ఇలా జీవించటాన్ని వారు బ్రహ్మచర్యం అని పేరుపెట్టారు. బ్రహ్మచర్యం అంటేనే పవిత్రత సచ్ఛీలతలకు మారుపేరు.

బ్రహ్మచర్యం తర్వాత రెండో దశ అంటే మరో పాతికేళ్ళపాటు భార్యతో ఆదర్శవంతంగా జీవితం గడిపారు. భార్యతో కాపురం చేసినందువల్ల సృష్టి కొన్ని శారీరక అప్పగింతల్ని సంతానం రూపంలో అతడికిచ్చింది. ఈ రెండవ దశలోని పాతికేళ్ళ కాలంలో వారికి జీవితాన్ని గడిపే శిక్షణ ఇచ్చింది. పెద్దకుమారుడు ఇల్లు నడపగల స్థితికి వచ్చినప్పుడు అతడు పాతికేళ్ళ మూడవ దశలో అడుగు

పెట్టాడు. యాభయి ఏళ్ళ తర్వాత సన్యాసం స్వీకరించాడు. సన్యాసం అనే శబ్దం, ఇప్పుడతను దైవాన్ని అన్వేషించడానికి బయలు దేరాడని సాక్ష్యమిస్తోంది. డబ్బు పోగుచేసి ధనవంతుడు కావాలనే కోరిక అతడికి లేదు. పైగా అతడు దానిని త్యజించి సన్యాస జీవితంలోకి ప్రవేశించాడు.

ఇలా వివరించడంలోని ఉద్దేశ్యమేమంటే జీవితంలోని మొదటి దినం నుండే బ్రహ్మచారి అయినా లేక యాభయి ఏళ్ళ తర్వాత అయినా అతడి లక్ష్యం ప్రాపంచిక సుఖాల్ని పోగుచేసుకోవడం కాదు. కాని ఈనాడు బ్రహ్మచారిగా ఉండే పోకడలో దైవప్రీతి కోసం చేయాలన్న భావన గానీ, దైవాన్వేషణ గానీ లేవు. ప్రాపంచిక వైరాగ్యమూ లేదు, ఏ అర్థంలో  చూసినా కనబడదు. ఉన్న లక్ష్యమల్లా, పురుషుడు సంపాదించి ధనవంతుడవ్వున్నట్లుగానే మేం ఆడవాళ్ళం కూడా ధనవంతులం ఎందుకు కాకూడదు? అన్నదే.

వారి నినాదం, మేమూ మొగవాళ్ళలా పని చేయగలం, వారిలా మాలోనూ సామర్థ్యం ఉంది. మేమూ రాజకీయ రంగంలో నెగ్గుకు రాగలం. మాలో మహారాణి విక్టోరియా ఉన్నారు. జోన్ అఫ్ లార్క్ ఉన్నారు. బాల్బన్ కుమార్తె ఉన్నారు. దక్కన్‌కు చెందిన చాంద్ సుల్తానా ఉన్నారు. ఈనాటి ఇందిర ఉన్నారు వగైరా...

దీని అర్థం ఏమంటే, ఏదో ఒక పొజిషన్ సాధించడం, పేరు ప్రఖ్యాతులు పొందాలన్న తపన, అంతకన్నా ఎక్కువగా పురుషుల మీద కసి, ద్వేషం అతడిపై ప్రతీకార వాంఛ. ఇవి ఆనాటి భీష్మపితామహుడు, నిన్నటి అహల్య, మొన్నటి రాబియాబస్రీ, తదితర బ్రహ్మచారులు, సన్యాసులకు ఉన్నటువంటి ఉన్నత దీక్ష ఈనాటి మహిళలో జనించనయితే లేదు, ప్రాపంచిక వ్యామోహం పెల్లుబికి, ఆమె అవివాహితగా ఉండిపోయేందుకు ఇష్టపడటం విచారకరం.

ఈనాడు అవివాహితగా ఉండిపోగోరటంలో ఈనాటి స్త్రీ మస్తిష్కంలో ఇంద్రియ నిగ్రహం కోర్కెల్ని అణచుకోవటం అనే ఆలోచనలేదు. దాని అర్థం మనం ఒక పురుషుడికి అణగిమణిగి ఉండటమో లేక ఎవరినయినా

వివాహమాడి ఉండిపోవడమో. దాంతోపాటు పెళ్ళి చేసుకోకుండానే అక్రమంగా సంబంధాలు లేక కొద్ది నిమిషాల పాటు గడిపే భర్తల్ని ఎంత మందిని కావాలనుకుంటే అంతమందినీ చేసుకోగలం అన్నదే అని కూడా గ్రహించాలి.

స్పష్టంగా మేము పైన పేర్కొన్న విషయం స్పష్టం చేసేదేమంటే- ఈనాడు అవివాహితగా ఉండిపోవటంలోని అర్థం ఏమిటి? నేడు ఈ అవివాహితగా ఉండిపోవటంలోని అర్థం యొక్క ఫలితాల్ని మేము ముందుకు తేదలుచుకున్నాం.

అవివాహితగా ఉండిపోవటం లేక కొద్ది నిమిషాల భర్తరికంలో భార్యాభర్తలా గడపటంలోని నష్టాల్ని ప్రయోగాత్మక పెళ్ళిళ్ళు అనే శీర్షికన తెలియపర్చాం. ఇందులో స్త్రీ తన ధనాన్ని ఖర్చు చేయవలసి వస్తుంది. అటువంటి స్త్రీకి రకరకాల జబ్బులూ అంటుకుంటాయి. ఈ రంగంలో స్త్రీయే పురుషుని వలన నష్టపోతుంది.

ఇక పెళ్ళి చేసుకోకుండా తనను తాను కాపాడుకుంటూ, మగవాడి వాసన తగలనీయకుండా ఉండటమో లేక పురుషుడ్ని తన వెంట పడనీయకుండా చేస్తే ఏ ఇంద్రియాలు పటుత్వం కోసం ఈనాడు రకరకాల పద్ధతులు మన ముందుకు వస్తున్నాయో , ఆ ఇంద్రియాలు ఉద్రేకం పొందుతాయి. వీటిని నిగ్రహించటం అసాధ్యం. పురాతన కాలంలో బ్రహ్మచారులు ఎలా కోరికల్ని జయించారు అని అనవచ్చు. చర్చిలలోని ఫాదరీలు, దేవదాసీలు ఎలా నిగ్రహించుకున్నారు? అని ప్రశ్నించవచ్చు. నిన్నటి బ్రహ్మచారుల మనసుల్లో ఉన్నతస్థాయి దైవభక్తి ఉండేది. ఈ ప్రామాణికత కారణంగా ఏదో విధంగా ఎదుర్కొన్నారు. కాని ఈ ఉన్నత ప్రామాణికత దృక్పథం నుండి నిష్క్రమించినప్పుడు వారిలో చాలా మంది ఫెయిల్ అయ్యారని చరిత్ర చెబుతోంది. చరిత్రకారులు మత వ్యభిచారం శీర్షికతో ఖానఖా (మఠాలు) కల్పిత జోగినులు ఉర్సులలోని మేలాలలోని తమాషాల గుట్టువిప్పారు. మన చెవులనే కాదు, మన కళ్ళను కూడా తెరిపించేందుకు అది చాలు.

మరయితే- ఈనాటి స్త్రీల ఎదుట దైవత్వభావన అన్న ఉన్నత లక్ష్యం కూడా లేనప్పుడు, కేవలం ప్రాపంచిక లోలత్వం మాత్రమే ఉన్నప్పుడూ, వారు పురుషుని పట్ల నిర్లక్ష్యంతో ఎలా ఉండగలరు? ఒకవేళ ఉన్నా ఎదురయ్యే ఫలితాల్ని ఆ స్త్రీలలో చూడనూవచ్చు.

సృష్టి బాలబాలికలలో వారు ఈడేరే వయస్సుకు చేరుకుంటూ ఉండే నాటికి వారిలో ఒక విస్ఫోటన శక్తిని పరిపూర్ణం చేస్తుంది. అది వారిని పరస్పరం కలుసుకునేందుకు ఆరాటాన్ని పుట్టిస్తుంది. ఈ విస్ఫోటన శక్తి శరీరం నుండి వెలువడేందుకు తానూ ఆరాటపడుతుంది. మనిషినీ ఆరాటపెడుతుంది. వారిలోని ఈ విస్ఫోటక శక్తిని అణచివేస్తే అది, ఆ శక్తిపై దౌర్జన్యానికి పాల్పడినట్లే అవుతుంది. మనిషికీ ప్రమాదం కలుగుతుంది. హకీములు, డాక్టర్లూ అందువల్ల కలిగే నష్టాల్ని ఇలా వివరించారు. ముక్తసరిగా ఇవి:

● ఉష్ణ ప్రాంతాలలో పదేళ్ళలోపు, శీతల ప్రాంతాలలో ఇరవై ఏళ్ళలోపు, సమశీతోష్ణ ప్రాంతాలలో పదిహేనేళ్ళ లోపు, ఈ శక్తి మానవులలో రగుల్కొంటుంది. కాని, అప్పుడు సిగ్గు బిడియాలు, సామాజిక బంధనాలు దానిని నిరోధించడంలో ఎంతో సహాయకారులవుతాయి. అప్పుడు వదనాలలో ఒక విధమైన తేజస్సు వెలువడునారంభిస్తుంది. ఆ శక్తికి గనక అప్పుడు సరైన శిక్షణ లభిస్తే పదహారు, పదిహేడు లేక ఇరవై ఏళ్ళ వయసు వరకు అది శరీరాన్ని దృఢంగా బలిష్టంగా అందంగా తీర్చిదిద్దుతుంది. స్త్రీ శరీరం పరిమాణంలో మరికాస్త సౌందర్యాన్ని ఇనుమడించుకుంటుంది.

ఆ తర్వాత ఆ శక్తికి సక్రమంగా ఆహారం లభించకపోతే అప్పుడు అంటే గరిష్టంగా ఇరవై ఐదేళ్ళ వయసు తర్వాత దానిని అణచివేస్తే ఈ గొప్ప శక్తే అన్నింటికన్నా ముందు మనిషి రక్తంలో ఎసిడిటీ పెరిగిపోయి ఆరోగ్యంపై దాడి చేస్తుంది. సాధారణంగా అందరిలో ఫలానా వారి రక్తం ఉడుకెత్తిపోయిందని అనబడుతుంది. రక్తంలో ఎసిడిటీ పెరగటం లేక రక్తంలో వేడి ఎక్కువై దురద, దద్దుర్లు, కుష్టు, మూత్రంలో మంట, కిడ్నీలలో నొప్పి, హిస్టీరియా ఫిట్స్,

రేచీకటి, బిగుసుకుపోవటం వంటి రోగాలు కలగటం ఆరంభమవుతుంది. వివాహం చేసుకోవటం ద్వారా వాటిని నిరోధించవచ్చు. వాటిలో హిస్టీరియా ఫిట్స్, శరీరం బిగుసుకుపోవటం, రేచీకటి, కిడ్నీలలో నొప్పి, మూత్రంలో మంట వంటివి నిరోధించబడతాయి. కానీ దద్దుర్లు, దురదలు బాధిస్తాయి. పెళ్ళయిన జంటలు రక్తంలోని ఎసిడిటీ చికిత్స చేయించకపోవటం అసమగ్రతను పాటించడం చేస్తే వయసు చివరి దశలో కుష్ఠువ్యాధి పీడితులవుతారు.

నలభయి ఏళ్ళ వయసు తర్వాత పురుషులలో తక్కువ అవుతుంది కారణం, వారు పగలల్లా శ్రమిస్తారు. తమ శరీరానికి వ్యాయామం కలిగిస్తారు. స్త్రీలలో వాతంతో కూడిన ఊబకాయం పెరిగిపోతుంది. అందువల్ల వారికి పగటిపూట తక్కువగానూ, రాత్రిపూట ఎక్కువగానూ బాధ కలుగుతుంది. స్త్రీ, పురుషులిద్దరూ నిద్రాలేమికి గురవుతారు. రాత్రిళ్ళు నక్షత్రాల్ని లెక్కపెట్టుకుంటూ గడుపుతారు. వాతం శరీరంలోని కండరాలలో నొప్పిని కలిగిస్తుంది. అందువల్ల నిద్రమరింతగా లోపిస్తుంది. రాత్రంతా మనిషి మూలుగుతూ ఉంటాడు. అటువంటప్పుడు పురుషుడు అయినా, స్త్రీ అయినా నిద్రమాతలు మ్రింగో లేక ఇంజక్షన్ చేయించుకునో నిద్రిస్తారు. ఈ రెండూ వస్తువులూ కూడ ఆరోగ్యానికి చేటు కలిగించేవే. మరి దురదుష్టవంతులు అంతకన్నా ఏం చెయ్యగలరు. చేతులారా చేసుకున్నదేగా. స్వయంకృతానికి చికిత్స ఏముంది? విషానికి చికిత్స విషమే.

● వివాహం లేకుండా జీవితం గడపాలని స్త్రీ సంపాదించుకోవడం ప్రారంభించినప్పుడు ఆమె ఎన్నో కఠిన దశలను దాటవలసి వస్తుంది. ఇప్పటి వరకు లభించిన అనుభవం ఏమంటే, కొన్నిచోట్ల గత్యంతరం లేక దెబ్బ తింటుంది. ఆ తర్వాత అక్రమ సంతానాన్ని కళ్ళు తెరవకుండా చేసేందుకు అవలంబించిన పద్ధతుల వల్ల ఆమె ఆరోగ్యం ఘోరంగా దెబ్బతింటుంది. ఆ తర్వాత పశ్చాత్తాప పడుతుంది. అలా పశ్చాత్తాప పడినందువల్ల ఆమెకు కలిగే ప్రయోజనం ఏమీ లేదు. ఆత్మహత్యల పరంపర మొదలవుతుంది. చచ్చిపోతే బాగుండునని స్త్రీ తలపోస్తుంది.

● సమాజంలో పెళ్ళికాని స్త్రీ పురుషులకు గౌరవస్థానం లభించదు. ఆమె నడవడిక అనుమానాస్పదం అవుతుంది. ఆమెపై ఎవరూ నమ్మకం పెట్టుకోరు. సలహా సంప్రదింపుల వ్యవహారాల్లో ఆమెకు చోటివ్వరు. ఆమె అభిప్రాయం సమతూకం లేనిదిగా ఉంటుంది. ఇటువంటి స్త్రీ పురుషులు రాత్రి ఒక నిర్ణయం, ఒక ప్రణాళిక తీసుకుంటారు. పగలు వాటిలో ఒక దాన్నీ అమలు పర్చరు.

ఇలాంటి ఎన్నో అనుభవాలు, సంఘటనలు ఈనాడు మనం చూడవచ్చు. నా మిత్రుడొకరు ఒక స్త్రీని మనస్ఫూర్తిగా ప్రేమించాడు. ఇది అతడివాదం. అటువంటి నిజమయిన ప్రేమలో అతడు సఫలీకృతుడు కాలేదు. అంటే ఆ స్త్రీతో అతడి వివాహం కాలేదు. ఇప్పుడతను ఇక నేను మరే స్త్రీనీ పెళ్ళి చేసు కోను అన్నాడు. అతడు బ్రహ్మచారిగా ఉండిపోయాడు. నలభయి ఏళ్ళ వయసు వచ్చేసరికి ఇంతకు ముందు తెలిపిన రోగాలు అతడిపై దాడి చేశాయి. ఇప్పటికయినా పెళ్ళి చేసుకో అని నేను సలహా ఇచ్చాను. కాని అతడు నా మాట వినలేదు. మందులతోను అణగని ఆ శక్తిని అతడు అణచి వేయసాగాడు. చివరకు రోగం బయటపడి ఈనాడు అతడు మంచాన పడ్డాడు. ఎప్పుడు చూసిన కంగారు కంగారుగా ఉంటాడు. ఎప్పుడయినా నేను క్షేమం అడిగినప్పుడు, నీ సలహాను నేను పాటించలేదు. అందుకు ఫలితం అనుభ విస్తున్నాను. అది నా సలహా కాదు. నీకో విషయం తెలుసా? 'దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం నికాహ్ నా సాంప్రదాయం. వివాహం చేసుకోని వాడితో నాకు సంబంధం లేదు' అని సెలవిచ్చారని నీకూ తెలుసు. కనుక మిత్రమా! ఇది నా సలహాకాదు. నేను అల్లాహ్ మరియు ఆయన ప్రవక్త (సల్లం) ఆదేశం ప్రకారమే చెప్పాను. ఇక నువ్వు ఈ ఆదేశానికి వ్యతిరేకించి నందుకు ఫలితాన్ని అనుభవించక తప్పదు.

అయితే తౌబా, అస్తగ్‌ఫార (పశ్చాత్తాపం, మన్నింపు దుఆ) పరలోక శిక్ష నుండి కాపాడుతాయన్నది వేరే విషయం. అందుకోసం నేను కూడా ప్రార్థిస్తు న్నాను, ప్రార్థిస్తు ఉంటాను.

నా యీ మాటలు విన్న నా మిత్రుడు, ఒక పిల్లవాడు తాను పోగొట్టుకున్న వస్తువు కోసం విలపించినట్లుగా విలపించసాగాడు.

వివాహం చేసుకోని జీవితం గురించి చేసిన ఈ విశ్లేషణ కేవలం డాక్టర్ ప్రమీలా కపూర్ తన గ్రంథంలో పేర్కొన్న ఆ హిందూ స్త్రీల కోసమే చెయ్యలేదు. పైగా ముస్లింలలో కూడా వారు దూరదృష్టితో వ్యవహరించాలని అంటు న్నాను. గుడ్డిగా కాలప్రవాహానికి వదలివేయకూడదు. సామాజిక పరంగా వారి మతం వారికి హక్కులను ఇచ్చివుంది. వారు ఈ హక్కుల కోసం పోరాడ వలసిందే. కాని ఇస్లామీ ఫికహ్‌కు లోబడని జీవితంగానీ, ఇస్లామీ ప్రాథమిక సిద్ధాంతాల ఛాయలేని చోట గాలిలో ఎగరటం బుద్ధికుశలత కానేరదు.

## వివాహం మరియు తల్లిదండ్రుల సమ్మతి

డాక్టర్ ప్రమీలా కపూర్ గారు స్వయంగా కలుసుకుని వారి అభిప్రాయాల్ని గ్రంథస్తం చేశారు. వారిలో 21 ఏళ్ళ లలిత ఒకరు. బి.ఏ. చదివిన మారుతున్న భారత స్త్రీకి ఈమె చక్కటి ఉదాహరణ. ఇంటర్వ్యూ సందర్భంగా ఆమె చాలా ఓపెన్‌గా ఇలా అన్నారు: "నేనొక స్వేచ్ఛాజీవిని. స్వేచ్ఛ- చేయదలచుకున్న దంతా చెయ్యడానికి స్వేచ్ఛగలదానిని. నా మాతాపితరులు పాపం అని, అప రాధం అని అన్న విషయాలన్నీ నేను మంకుపట్టుతో చేస్తున్నాను."

బి.ఏ. చదివిన లలిత తానొక స్వేచ్ఛాపరురాల్ని అంటోంది. అహంకారంతో నేను స్వేచ్ఛా జీవిని అని ఏ విషయాలలో ఆమె అంటోంది? మాతాపితరులు పాపం అనీ, అపరాధం అనీ చెప్పి, నిరోధించే విషయాలు ఏమిటి?

మాతా పితరులు చెప్పే మాటలు మతం, వంశాలకు సంబంధించినవై ఉంటాయి. మరికొన్ని విషయాలు వారి అనుభవాన్నిబట్టి చెప్పేవి అయి వుంటాయి. మతం, వంశానికి సంబంధించిన మాటలు సర్వసాధారణంగా ఇలా ఉంటాయి: "అమ్మాయి! నీవు నీతో జీవితం గడపడానికి మన మతం, మన కులానికి చెందినవాడ్ని ఎంపిక చేసుకో. మేము కళ్ళారా చూసిందీ, మా

అనుభవంలోకి వచ్చినదేమంటే, అనేక మంది యువకులతో సంబంధం పెట్టుకోవడం వలన భావాలలో విభేదం కలుగుతుంది. వారిలో విశ్వాస పాత్రుడు ఎవరూ ఉండడు. నీ శరీర లావణ్యం తన మెరుపుని పోగొట్టుకున్నప్పుడు అతడు నిన్ను వదిలేస్తాడు. అప్పుడు నీ పరిస్థితి త్రిశంకు స్వర్గంలా ఉంటుంది."

మా అభిప్రాయంలో తల్లిదండ్రుల ఈ హితబోధ సరయినదే. తమ ప్రియ పుత్రికను అనేక కష్టాలకు ఎదురీది 21 ఏళ్ళ వరకు ఏ తల్లిదండ్రులయితే పెంచారో ఎవరైతే తమ కష్టార్జితం అయిన ధనాన్ని ఆమె వృద్ధి చెందటానికి ఖర్చు చేశారో, స్వయంగా వారు కష్టాల్ని దిగమ్రింగి తమ కూతురు కష్టపడ కూడదని శ్రమించారు. ఆ తల్లిదండ్రులు ఆమె ఇరవై ఒకటో ఏట ఆమెకు శత్రువులు కాజాలరు. ఇప్పటికీ వారు ఆమె జీవితాన్ని సుందర సాదృశ్యంగా మలచాలని కోరుకుంటారు. మాతాపితరులు ఈ ప్రపంచాన్ని ప్రాపంచిక సమస్యల్ని అనుభవించారు. తమ అనుభవం ద్వారా వారు సంపాదించిన జ్ఞానంలో వారికి ప్రయోజనం కనిపించింది. అందుచేత వారి కూతురు జీవితంలో తన జీవితాన్ని సర్వనాశనం చేసుకోకూడదని తలపోస్తారు.

నలభై, నలభై రెండేళ్ళ వయసుగల మాతాపితరులు ముందు, ఇరవై ఒక్క ఏళ్ళ లలిత అనుభవం ఏపాటిది? ఇరవై, ఇరవై ఒక్క ఏళ్ళుగల కోర్కెలను మనసులో ఉంచుకున్న అమ్మాయికి మెరిసేదంతా మేలిమి అనుకుంటుంది. దానినే గీటురాయి మీద పరీక్షించినప్పుడు రాగి, ఇత్తడి కనిపిస్తాయి. బంగారాన్ని పరీక్షించేది మేము, మా సలహాను స్వీకరించు అంటారు తల్లిదండ్రులు.

పెంకిఘటం అయిన లలిత మాత్రం తాను ఈ మాటలకు ఒప్పుకోననీ, స్వయంగా ప్రయోగం చేస్తాననీ, మీరు గనుక నన్ను ఆపే ప్రయత్నం చేస్తే, పంతంతో మీ యిష్టానికి వ్యతిరేకంగా చేస్తాను అని అంటోంది. తల్లిదండ్రులు తమ కుమార్తె కోసం వరాన్వేషణ చేసే సందర్భంలో, కుర్రవాడు ఎలాంటి వాడు అని పరికిస్తారు. అతడి స్వభావం ఎటువంటిది; వారి ఆచార వ్యవహా

రాలు, వారి కుటుంబ స్థితిగతులు, కుటుంబ పద్ధతులు ఎలా ఉన్నాయి? వగైరా అన్నీ చూస్తారు. మిత్రులనూ విచారిస్తారు. ఒకవేళ తమ కుమార్తె స్వభావంలో ఏదయినా లోపం ఉంటే తమకు తెలిసిన యువకుడ్ని, సహనం, సర్దుకుపోయే ధోరణి కలవాడ్ని తమ కూతురికి వరునిగా ఎన్నుకుంటారు. అయినా ఖరారు చేసుకునే సందర్భంగా ఇప్పుడెలాంటి ధోరణి ఉందోకూడా చూస్తారు. అంతేగాని కళ్ళుమూసుకుని కుమార్తెను కూపంలోకి నెట్టేయరు.

లలిత అంటుంది; బావిలో పడిపోవడం నాకు ఇష్టమే కానీ మీ హితోక్తి నాకక్కరలేదు. లలిత బి.ఏ. చెబుతున్నది సబబేనా అన్నది ఈనాటి హిందుస్తానీ పుత్రికలు ఆలోచించాల్సిన విషయం. ఆమె ఉద్రేకంలో అంటున్న మాటలేగానీ, స్పృహలో ఉండి చెబుతున్న మాటలుగా అనిపిస్తోంది.

తాను కాలేజీలో చాలామంది యువకుల్ని చూస్తున్నాననీ, వారిని కలుస్తుంటాననీ, వారిని అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తున్నాననీ, వారితో పిక్నిక్‌లకు వెళుతుంటాననీ, వారితో మాట్లాడుతుంటాననీ, ఏకాంతంలో కలుసుకుంటాననీ, వారిని పరిశీలిస్తుంటాననీ, కాబట్టి తన అభిప్రాయం సరైందేననీ, తాను చదువుకున్న అమ్మాయి కాబట్టి మోసపోననీ లలిత వాదిస్తుంది.

అనుభవం నేర్పుతున్నదేమంటే, ఇలాంటి అమ్మాయిలు ఎక్కువగా మోసానికి గురయ్యారు. మోసగించబడ్డాక వారి చేతికి చిక్కేది, తిరిగి ఉద్యోగం చేసుకోవలసిన అగత్యం ఏర్పడటమే. ఇక ఉద్యోగం చేసే కాలంలో ఎవరిని తన తాత్కాలిక భర్తగా చేసుకుంటుందో దేవుడికెరుక. సామాజిక జీవనానికి పునాదిని ఆమె నెలకొల్పుకోలేదు. కాళ్ళూ చేతులూ పని చేసినంత కాలం ఆమె డబ్బు సంపాదించి, అప్పటి (వృద్ధాప్యం) కోసం ఏమన్నా మిగిల్చి ఉంచుకునే ప్రయత్నం చేస్తుంది.

తల్లిదండ్రుల దృష్టి ఎప్పుడూ తమ జీవితపు ఆఖరి దశపైనే వుంటుంది. తమ కుమార్తెకు సంతానం కలగాలనీ, తమ కూతురికి ఆమె సంతానం వృద్ధాప్యంలో ఆసరా కావాలనీ వారు కోరుకుంటారు. లలిత వంటి అమ్మాయిలకు

ఈ విషయం ఇరవై ఇరవై ఒక్క ఏళ్ళ వయసులో అర్థం కాదు. ఉద్రేకపు పొంగులో కొట్టుకుపోయే, ఆధునిక నాగరికతలో కళ్ళు చెదిరిన అమ్మాయి ఇప్పుడు ఆలోచించజాలదు. ఎప్పుడు ఆలోచిస్తుందీ అంటే, అప్పుడు ఆలోచించినా ఎటువంటి ప్రయోజనం ఉండని సమయంలోనే.

డాక్టర్ ప్రమీలా కపూర్ వారితో పాల్గొన్న సమావేశాలలో అందుకు చెప్పిందీ విన్నారు. వారి స్టేట్‌మెంట్లను ఒకచోట సమీకరించారు. నలభయి, నలభై ఐదేళ్ళ మధ్య వయస్కురాలు, ప్రపంచ పోకడలను ఎరిగిన అనుభవజ్ఞురాలు అయిన మహిళా ప్రొఫెసర్ గారి ఈ పుస్తకం, ఇప్పుడొక నిర్మాణాత్మక పుస్తకంగా అంగీకరించబడుతోంది. ఆమెగారు ఈ యువతులకు ఏవైనా మార్గదర్శక సూత్రాలు చూపివుంటే ఎంతో బాగుండేది. ఉదాహరణకు:

- మతం, అనుభవాల వెలుగులో ఒక కుమార్తెగా, ఒక భార్యగా, ఒక తల్లిగా స్త్రీ హక్కు అంగీకరించబడాలి.
- వివాహం విషయంలో ఆమె ఇష్టానికి పెద్దపీట వెయ్యాలి. ఆమెకు ఉత్తమ సలహాలను ఇవ్వడం అయితే జరగాలి. కాని అనుమతి లేకుండా ముక్కూమొహం తెలియని వాడికి కట్టబెట్టరాదు.
- ఒకవేళ అమ్మాయి విద్యావంతురాలు అయితే జాతి, కుల బంధనాలలో సడలింపు నివ్వాలి. కుల గోత్రాలు, హెచ్చుతగ్గుల దృక్పథం సమాజాన్ని నాశనం చేసేసింది. తన నడవడికలు ఉత్తముడయిన వాడిని గౌరవనీయుడుగా, గొప్పవాడుగా భావించాలి.
- మతంలో అయితే ఈ విషయాన్ని ఉన్నతం చేసి చూపబడింది. మీలో అందరికన్నా గౌరవనీయుడు, అల్లాహ్‌కు, సర్వేశ్వరుడికీ అధికంగా భయపడేవాడే.
- గృహ జీవితంలో ఆమెను విద్యామంత్రిగా చెయ్యాలి. పురుషుడు అధికారం గలవాడే అయినా గృహజీవితంలో స్త్రీకి తన ప్రతిభ చూపే అవకాశాన్ని ఇవ్వాలి.

- స్త్రీకి వివాహం అయిన తర్వాత తాను సంపాదించుకున్నది తనదే కావాలి. కట్నం రూపంలో లేక తల్లిదండ్రులు లేదా భర్త ఆమెకు నగల రూపంలో లేక మరే రూపంలో ఇచ్చినదంతా ఆమె పెట్టుబడిగానే భావించాలి. ఇది నీదే అని ఆమెకు చెప్పాలి.
- విధవ అయిన తర్వాత ఆమె తన విషయంలో సర్వాధికారిగా అంగీకరించబడాలి. ఆమె ఎక్కడ ఎవరిని కావాలనుకుంటే వారిని వివాహమాడవచ్చు.
- విధవ అయిన స్థితిలో ఆమె భర్త ఆస్తి నుండి ఆమె వాటా ఆమెకు ఇప్పించాలి.
- వివాహ సందర్భంగా మతం విషయంలో నిబంధన తప్పక విధించాలి. సివిల్ మ్యారేజిని నిషేధించబడినదిగా నిర్ణయించాలి.
- తలాఖ్, ఖులాల హక్కు స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా లభించాలి.
- తన కోరికలు ఒకే భార్యతో తనివి తీరనంతగా ఉంటే (అందుకు వివిధ కారణాలు ఉండవచ్చు) అతడు ధర్మబద్ధంలో రెండో పెళ్ళి చేసుకునే హక్కు అతడికి లభించాలి. అందుకు భిన్నంగా అతడు ఒకే భార్యను కలిగి ఉండి, అనేక స్త్రీలతో ఆటలాడుకునే హక్కును ఎంతమాత్రం అంగీకరించరాదు. చట్టబద్ధంగా అందుకు శిక్ష నిర్ణయించబడాలి.

## వివాహం ఒక పవిత్ర ఒప్పందం

డాక్టర్ గారి పుస్తకం గురించిన ముక్తసరి పరిశీలన ఆఖరి దశలో వుంది. మేము కావాలనే వివాహం విషయంలో మా అభిప్రాయాల్ని చివరగా వెల్లడించాం. అంటే చివరలో దీనిపై అభిప్రాయ ప్రకటన చెయ్యాలని నిర్ణయించాలనుకున్నాం. డాక్టర్ గారు ఇంటర్వ్యూ చేసిన యువతుల్లో మొండి స్వభావి అయిన ఒకరు కోపంతో చిందులు వేస్తూ ఇలా అన్నారు:

"వివాహం ఈనాడు ఎలా చేయబడినా అది ఒక వ్యభిచారమే. దానికి సమాజం చట్టపరస్థాయిని కల్పించింది. వివాహం స్త్రీలపై విధింపబడిన ఒక చెరసాల."

ఇటువంటి మనస్తత్వం గురించి విచారం ప్రకటిస్తూ ఇలా రాశారు డాక్టర్ ప్రమీలా కపూర్.

"ఈమె మారుతూ ఉన్న భారతనారి. ఆమె పెళ్ళి గురించి ఎలా ఆలోచిస్తోందో చూడండి."

మేము మరోసారి ఆక్షేపిస్తున్నాం. డాక్టర్ గారు ఈ మారుతున్న పోకడను వివరించడం అయితే చేశారు; విచారమూ ప్రకటించారు. కాని ఆ పోకడలకు మార్గదర్శనం మాత్రం చెయ్యలేదు.

ఇంటర్వ్యూ చేసేవారు, తమ శ్రోతల మనోభావాలను ప్రజలకు అందించడంతోపాటు, ప్రజల ఆలోచనల్ని సన్మార్గం వైపు మళ్ళించడమే నిర్మాణాత్మక సమావేశం కాగలదు.

మానవుడు ఒక బాధ్యతాయుతుడైన వ్యక్తి. మృగం కాదు. అందుచేత అతడు నాగరిక జీవితం గడపదల్చుకుంటే అతడు ఒక చట్టపరిధిలో జీవితం గడపాల్సి ఉంటుంది. లేకపోతే మృగంగా మారి మానవ జనావాసాలను మహారణ్యాలుగా చేయడమే కాగలదు. ఇక వినయ విధేయతలకు అర్థమే ఉండదు అని తెలియపర్చి ఉండవలసింది. ఒక ఉదాహరణను పరిశీలించండి.

ఎవరినయినా బంధిఖానాలో పడవేయడం చాలా చెడ్డ విషయం. ఎవడినయినా హత్య చెయ్యడం గొప్ప దౌర్జన్యం. ఇది ఇంత వరకూ ఎవరూ తిరస్కరించని విషయం. కాని ఒక మనిషి దోపిడీలు, దొంగతనాలు చేసి మానవ జీవితంలో భయభ్రాంతుల్ని వ్యాపింపజేస్తూ పోతున్నాడు. అతడి భయంవల్ల వ్యాపారాలు అస్తవ్యస్తం అయిపోతున్నాయి. రాకపోకల రహ దారులు

అరక్షితం అయిపోతున్నాయి. అలా అయితే చట్టం ద్వారా అతడి దౌర్జన్యాల్ని, ఆధిపత్యాన్ని అడ్డుకోనైనా అడ్డుకోవాలి. లేదా ప్రజలంతా కలసి అతడ్ని ఎదిరించాలి. మొత్తానికి అతడ్ని స్వేచ్ఛగా వదిలేయకూడదు. ఎందువలన? ఎందుకంటే అతడు ప్రజల శాంతిని నాశనం చేసేవాడు, క్షమా ర్హుడు కాడు. ఒకవేళ అక్కడతను తనకు గల స్వేచ్ఛతో అలా చేశాడు అంటే అది ఎవరికీ అంగీకార యోగ్యం కాజాలదు.

వివాహం కూడ ఒకరకంగా వ్యభిచారమే, దానికి చట్టరూపంలో విధించ బడింది. ఇది స్త్రీని ఖైదు చెయ్యడానికే విధించబడింది అని అనే అమ్మాయికి కూడా ఈ విషయమే వివరించాలి.

దీని అర్థం ఏమవుతుందంటే; ప్రపంచ చరిత్రలో మొదటి రోజు నుండే కనబడుతూ వచ్చిన వివాహ సంప్రదాయం, అప్పటి నుంచే స్త్రీపై జులుం చెయ్యడానికి చట్టస్థాయిలో ఈ నిర్బంధం గురించి ఆలోచించబడింది తప్ప స్త్రీకి దాని అవసరం లేదన్నమాట. ఆలోచించి, అర్థం చేసుకుని చెప్పబడిన మాట. అయితే అది స్త్రీ అవసరం, దాని ప్రాముఖ్యత దిశగా ఉండేది ఎలా? ఇటు చూడండి;

సృష్టి స్త్రీని పుట్టించి ఆమెలో కొన్ని విషయాల్ని ఉంచింది. అందువల్ల ఆమె ప్రతినెల కొన్ని దినాలపాటు మామూలుగానే ప్రభావితం అవుతుంది. ఆ తర్వాత తన జతగాడితో సంగమించి గర్భవతి అవుతుంది. అప్పుడు ఆ రోజుల్లో ఆమెకు అన్ని విధాలా సేవలు చేసేవారి అవసరం వస్తుంది. అంతగా ఆమె నిస్సహాయురాలు అయిపోతుంది.

అటువంటి పరిస్థితులలో ఆమెకు పుట్టబోయే బిడ్డకు అసలు తండ్రి అయినవాడే నిజమయిన సేవకుడు, మిత్రుడు అవుతాడు. అతడు ఆ పుట్టబోయే బిడ్డకు ఏమి అవుతాడో అందరూ ఎరిగినవాడే. ఆ కాబోయే తండ్రికి తన హృదయం కన్నా ఎక్కువగా ఆ స్త్రీకి సహాయం అవసరం అని భావించాలి. ఇంకా సమాజంలో అగౌరవపాలు అవుతామన్న భయమూ ఉంటుంది.

మతాలలో ఇందుకు బాధ్యత ఉంచబడిందని మేమిప్పుడే చెప్పడం లేదు. ఈ మధ్యలో వున్న చిక్కులన్నీ పరిష్కరించిన తర్వాత ఈ విషయాన్ని చివరలో తెలుపుతాం.

గమనించండి- పెళ్ళి అంటే ఒక పురుషుడు, ఒక స్త్రీ సమాజం ఎదుట పరస్పరం ఒక ఒప్పందం చేసుకుంటున్నారు. మతాలలో ఇక్కడ దైవాన్ని కూడా సాక్షిగా చేసుకోవడం జరుగుతుంది. స్త్రీ విషయంలో ఎటువంటి అవసరం వచ్చినా తన వంతు బాధ్యతను నిర్వహించే బాధ్యత పురుషుడు స్వీకరిస్తు న్నాడు.

ఇటువంటి ఒప్పందం లేకుండా వ్యభిచారం చేయబడితే, అందులోనూ మగవాడు కూడా ఇటువంటి బాధ్యత స్వీకరిస్తాడా అని ఈ అనుభవ శూన్యు రాలు, మొండిఘటం అయిన ఆ అమ్మాయి తెలుసుకోవాలి. ఎంత మాత్రం స్వీకరించడు. గుడ్డి దేవత ఇద్దర్నీ అంధులుగా చేసేస్తుంది. స్త్రీ ఒక ప్రత్యేక పరిస్థితిలో చిక్కుకున్నప్పుడు ఆ కళ్ళు తెరచుకుంటాయి. తరువాత ఎవరి కారణంగా తాను ఈ దిశగా వచ్చిందో ఆ పురుషుని వంక చూసినప్పుడు ఆ మగవాడు వికటపు నవ్వు నవ్వి ఆమెను వ్యభిచారిణీ అని సంబోధిస్తాడు. ఆ స్త్రీ అతడి దృష్టిలో పతితురాలు అయిపోతుంది. అతడు పుట్టబోయే బిడ్డకు ఎటువంటి బాధ్యత గానీ, ఆ స్త్రీ అవసరం కోసం ఎటువంటి సహకారాన్ని గానీ తనపై వేసుకోడు.

ఇదొక దుశ్చర్య, అందుకే దానిని వ్యభిచారంగా, చెడు చేష్టగా చెప్పడం జరిగింది. పురుషుడే స్వయంగా మతంలో దైవం తరపున, సమాజంలో ప్రజల తరపున ఈ కారణంగానే ఒక వ్యక్తి సమాజంలో బహిరంగంగా వందలు, వేల మందిలో తన కుమార్తె చేతిని ఒక పురుషుని చేతికి అందిస్తున్నాడు. ప్రజలు సంతోషించి అతడికి శుభాకాంక్షలు అందజేస్తారు.

నువ్వేం చేస్తున్నావని అతడ్ని ఎవరూ అడగరు. ప్రమీలా కపూర్ కలుసు కున్న యువతి ఇంకా ఇటువంటి పరిస్థితులకు లోనుకాలేదు. ఆమె కళ్ళు

తెరచి ఇటువంటి పరిస్థితులలోని స్త్రీలను చూడలేదు. ఒకవేళ చూసినా సామనన్యంతో పరిశీలించలేదు. అసలు నిజం ఏమంటే, పురుషుడే, ఆమెకు బందీ అవుతాడు.

ఈ విషయం స్పష్టం అయిపోయిన తరువాత ఒక పవిత్రమైన ఒప్పందాన్ని వ్యభిచారం అని ఎవరు అనగలరు? ఒకవేళ అలా అనివుంటే ప్రపంచంలో మంచీచెడులను పరీక్షించే కాలమానం అనేదే ఉండదు. మనిషి అడవి జంతువుగా ఉండిపోతాడు. ఇటువంటి అమ్మాయి దీనినే కోరుతోందా? అలా అయితే పైన తెలుపబడిన ప్రత్యేక పరిస్థితులలో ఆమె ఎవరి అండలో ఉంటుందో ఆమెయే ఆలోచించుకోవాలి.

ప్రపంచంలో ఎల్లప్పుడూ వివాహాన్ని ఒక పవిత్రమైన ఒప్పందంగా పేర్కొన బడింది. అందుకు భిన్నంగా ఈనాడు ఒక యువతి ఇలా ఆలోచిస్తోంది. షైతాను అనుచరులు అయిన స్త్రీ పురుషులు అన్ని కాలాల్లోనూ ఇలా కూడా ఆలోచించారు. కాని వారిలో బహిరంగంగా పెద్ద సమూహంలో ఈ మాటను పలికే సాహసం లేకపోయింది. ఈనాటి ప్రత్యేక విషయం ఏమంటే ఇప్పుడు ఎదురూబెదురూ, సంకోచం లేకుండా పలకబడుతోంది. ఈ కారణంగానే డాక్టర్ ప్రమిలా కపూర్ భారత్ నారి ఏ రకంలో మారుతోందో భారతవాసులకు తెలియజేయగోరుతున్నారు.

ఇక మతపరంగా ఈ  విషయాన్ని పరిశీలిస్తే ఇందుకు దేవుని మహోప కారాన్ని అంగీకరించవలసి ఉంటుంది. ఈ స్త్రీకి నాజూకు పరిస్థితులలోని అవసరాల కోసమే కాకుండా, ఆమెకు యావజ్జీవిత కాలానికి పోషణ మరియు ధర్మబద్ధ అవసరాలను పురుషుడే తీర్చవలసి ఉంటుంది అనే బాధ్యత పురుషునిపై మోపబడింది. అంటే పురుషుడు ఖైదులో వేయబడ్డాడన్నమాట. అతడు గనక ఇందుకు అంగీకరించకపోయినట్లయితే అది వ్యభిచారం అవుతుందనీ, అందుకు ఫలానా శిక్ష ఉందని మతం అంటుంది.

రెండో విషయం, ఈ పవిత్ర ఒప్పందాన్ని, పురుషుని నిర్బంధం నిండు సమూహంలో అంగీకరించబడాలి అని మతం చెబుతోంది. కనుక ఇలాగే జరుగుతూ వస్తోంది. ఫలితంగా ఈ పవిత్ర ఒప్పందమే ఒక సంస్కృతికి రూప కల్పన చేస్తుంది. కుటుంబాలు పోషించబడతాయి. ప్రజలు పరస్పరం సంబం ధాలను ఏర్పరచుకుంటారు. వరసలు బంధుత్వాలు ఏర్పడుతాయి. ఒకరు తండ్రి అయితే మరొకరు బాబాయి అవుతారు. ఒకరు మామయ్య అయితే మరొకరు తాతయ్య అవుతారు. వేరొకరు బాబాయి (పిన్ని భర్త) వగైరా వారిలో ఎటువంటి నిర్మల ప్రేమ ఏర్పడుతుందో.

ఇటువంటి పవిత్ర ఒప్పందం అంటే నికాహ్ లేకుండానే కలుసుకునే జంటలకు ఒకరు తండ్రి కావటం కానీ, సోదరుడు, బాబాయి, తాతయ్య గానీ మేనమామ గానీ, పిన్ని భర్త అయిన బాబాయి గానీ, ఎవరూ ఉండరు. నిర్మలప్రేమ, సహాయం ఇక్కడ ఏర్పడవు. ఏకాకిలా తిరుగాడే మనస్తత్వంపై విచారం కలుగుతుంది. ఇంకా బిందువులుగా ఉండి సముద్రంలో చేరి మేమిప్పుడు బిందువులం కాదు మేమే ఒక మహాసాగరం అనేవారు అభి నందనీయులు.

ఇప్పుడు బాగా ఆలోచించి, ప్రమీలా కపూర్ గారిని కలుసుకున్న యువతి చేత ఇలా చెప్పించిన నాడి ఏదో తెలుసుకోండి. విషయం తిరిగి అక్కడికే వచ్చి చేరుతుంది, సమాజం పవిత్ర ఒప్పందాన్ని మరిచిపోయేలా చేసింది. పురుషుని బదులు స్త్రీని నిర్బందానికి గురిచేసింది, సమాజం ఆమెకు ఎటువంటి హక్కునూ మిగల్చలేదు, ఆమెకు తర్కా (భర్త ఆస్తిలో వాటా)కు వారసు రాలిగానూ చేయలేదు వగైరా.

అయితే ఈ దోషం, తమ పెద్దల మాటలను మర్చిపోయేలా చేసిన సమాజ పౌరులదే. ఇప్పుడు వారికి ఆక్షేపించబడిన విషయం గ్రంథాలలోనూ అదే లభిస్తుంది. కాని వివాహం యొక్క పవిత్ర ఒప్పందం పట్ల మనోవైకల్యమూ అవసరం లేదో "వ్యభిచారాన్ని' తిట్టవలసిన పనీలేదు. ఇటువంటి పవిత్ర

ఒప్పందం కోసం వివాహం మరియు నికాహ్ మరియు హక్కులు విధుల సిలబస్ ఎక్కడున్నా దొరుకుతుందా, లేదా అని అధ్యయనం చెయ్యాలి.

మాకు ఈ ప్రణాళిక లభించింది. ఈ ప్రణాళిక మాకు సంతృప్తికరం. జీవితం గడపడానికి అత్యుత్తమ కోర్సుకు సంబంధించిన పాఠాలు మా దగ్గరున్నాయి. వరుసక్రమాలు పరిశీలించండి-

"మీల ఎవరు వివాహం లేకుండా ఒంటరిగా ఉంటున్నారో, మీ స్త్రీ పురుష బానిసలలో ఎవరు గుణవంతులో, వారి వివాహాలు చేసివేయండి. వారుగనక పేదవారయితే అల్లాహ్ తన అనుగ్రహంతో వారిని సంపన్నులుగా చేస్తాడు. అల్లాహ్ అంతులేని వనరులు కలవాడు, సర్వమూ తెలిసినవాడు."

(నూర్‌సూరా:32)

రెండు విషయాలనూ ఒకేచోట చేర్చారు. పెళ్ళి చేసుకోమన్న ఆదేశమూ ఇవ్వబడింది. పేదరికంతో భయపడవద్దనీ చెప్పబడింది. రాబోయే పరిస్థితుల్ని మీరెరుగరు. అల్లాహ్ ఎరుగును. అల్లాహ్ వద్ద సంకుచితత్వం లేదు. ఆయన వనరులు అంతులేనివి.

ఒక జోకు వినండి- ఎంతో ఆసక్తికరమైన జోకు. ఈ జోకు విని దీన్ని రాసే వాడు నాలుగేసి భార్యల్ని చేసుకోమని ప్రోత్సహిస్తున్నట్లుగా భావించకండి. ఇంకా 'ఎవరైనా' ఈ రాసేవాడు ముస్లిం కాబట్టి ముస్లింల జనాభా పెంచుకోవడానికి ఇలా సూచిస్తున్నాడు, తద్వారా యాభయి ఏళ్ళలో భారత్ దేశంలో మెజారిటీ సాధించుకోవాలని ప్రోత్సహిస్తున్నాడేమో అని భయపడకండి.

కనుక సౌమనస్యంతో గమనించండి. ఒక వ్యక్తి దైవప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం సమక్షంలోకి వచ్చి విన్నవించుకున్నాడు. "దైవప్రవక్తా! నేను పేదవాణ్ని. ఏం చెయ్యమంటారు? ఆయన (సల్లం) సెలవిచ్చారు: "వెళ్ళు, పెళ్ళిచేసుకో." అతడు వెళ్ళి పెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడు అతని బాధలు పెరిగాయి. తన కోసమే సంపాదించుకోలేనివాడు ఇప్పుడు మరో ప్రాణిని ఎలా పోషించగలడు? తిరిగి ప్రవక్త సల్లం దగ్గరకు వచ్చి పరిస్థితి తెలియపర్చాడు. ఆయన సల్లం 'వెళ్ళి ఇంకొక పెళ్ళి చేసుకో' అన్నారు.

పేదవాడు వెళ్ళి మరో పెళ్ళి చేసుకున్నాడు. ఇప్పుడు ఇంకా కష్టాలు ఎదురయ్యాయి. మరలా ప్రవక్త (సల్లం) వద్దకు వచ్చి పరిస్థితి విన్నవించాడు. ఆయన (సల్లం) "మూడో పెళ్ళి చేసుకో" అన్నారు. అతడు మూడో పెళ్ళి చేసుకున్నాడు. ఆ తరువాత పరిస్థితి మరింత దుర్భరం అయ్యింది. తిరిగి దైవప్రవక్త (సల్లం)ను ఆశ్రయించాడు. ఆయన (సల్లం) 'అల్లాహ్ పేరుతో నాలుగో పెళ్ళికూడా చేసుకో, చూద్దాం అల్లాహ్ ఏం చేయనున్నాడో" అన్నారు.

క్షమించాలి, ఇదంతా నా మాటల్లో చెబుతున్నాను. హదీసులో దీనిస్థానం ఏమిటో తెలియదు. నేను ఎక్కడో ఉల్లేఖనాల్లో చదివాను. అదే విన్న వించు కుంటున్నాను.

"ఆ పేదవాడు నాలుగో స్త్రీని నికాహ్ చేసుకున్నాడు. ఈ చివరి స్త్రీ చేతి పనులలో ప్రావీణ్యురాలు. తివాచీలనేత తెలిసిన స్త్రీ. ఆమె రాగానే నాలుగు తివాచీ కేంద్రాల్ని ఏర్పాటు చేసింది. తన ముగ్గురు సవతులకూ నేర్పింది. అంతే, ఇక చూస్తుండగానే ఇంటి పరిస్థితి మారిపోయింది. భర్తబజారు పని చూస్తాడు. ముడిసరుకు ఇంటికి తెస్తాడు. తయారైన తివాచీలను బయటకు సప్లయ్ చేస్తాడు. ఒకరోజు దైవప్రవక్త (స) ఆ వ్యక్తిని గురించి దర్యాప్తు చేశారు. ఎలా ఉన్నాడు? అని. ఈ విషయం అతనికి తెలిసి పరుగున వచ్చాడు. 'నిశ్చ యంగా తమరు దైవప్రవక్తయే. ఈ విషయంలో నాకు నమ్మకం మరింత ధృడతరం అయింది. ఇప్పుడు అల్లాహ్ కృపవల్ల బాగున్నాను' అని విన్నవించు కున్నాడు. ఆయన సల్లం సంతోషించి అతడ్ని సాగనంపారు. "నిస్సందేహంగా అల్లాహ్ అపార వనరులు గలవాడు. గొప్పజ్ఞాని' అని పలికారు. మీరంతా అల్లాహ్ ఆదేశాన్ని పాటించండి. నిరుపేదలయినట్లయితే అల్లాహ్ మిమ్మల్ని దాతలుగా చేస్తాడు.

ఖుర్ఆన్ ఆదేశాన్ని విన్నారు కదా! ఈ ఆదేశాన్ని అంగీకరించడం గురించి కొందరు పండితులు (ఉలేమాలు) వాజిబ్ (తప్పనిసరి) అన్నారు. 'వాజిబ్ కావడంలోని భావం ఏమంటే పెళ్ళి గనక చేసుకోకపోయినట్లయితే పాపం చేసినవాడివి అయిపోగలవు. కాని చాలా మంది పండితుల దృష్టిలో ఇది వాజిబ్

కాదు. దైవప్రవక్త (సల్లం) సున్నత్. ఎందుకంటే ఒక వ్యక్తి ప్రయత్నించినప్పటికీ కూడా వివాహం చేసుకోలేకపోయినట్లయితే అందుకు అతడు దోషికాడు.

మొత్తానికి సున్నత్ అయినా వాజిబ్ అయినా లేశమంత తేడా ఉంది. ఇక దైవప్రవక్త (సల్లం) సున్నత్ (సంప్రదాయం) గురించి వినండి:

ఆయన (సల్లం) సెలవిచ్చారు: 'నికాహ్ నా సంప్రదాయం. ఎవరయితే నికాహ్ పద్ధతిని ఆమోదిస్తారో వారు నావర్గం వారు."

ప్రవక్త (సల్లం) ఎంతో జాగ్రత్తవహించి పలికారు. ఆయన (సల్లం) ఇలా చెప్పడంలోని మర్మం, వివాహం పట్ల ఆపేక్ష కలిగి ఉండాలి. ఒకవేళ వివాహం శాస్త్రపరమయిన నికాహ్ తరువాత సంతానం కలిగిన తరువాత అత్తవారింటి కొత్తకొత్త బంధుత్వాలు ఉనికిలోకి వస్తాయి. పిల్లవాడు పుట్టిన తరువాత ఒకరు నా సోదరి కుమారుడు వీడు నా మేనల్లుడు, నేనతని మేనమామని అంటారు. మరొకరు వీడు నాకూతురి పిల్లవాడు. నా మనవడు. నేనతని తాతయ్యను అంటారు. ఇంకొకరు గర్వంగా ఇతడు నా సోదరుని కుమారుడు అని అంటే ఒక స్త్రీ నేను ఇతడి పిన్నిని అంటుంది. ఇదంతా కూడ నికాహ్ బంధుత్వంతో పెనవేయబడ్డ పుట్టిన సంతానానికి మాత్రమే లభిస్తుంది. అక్రమమంగా, హరాం అయిన సంతానానికి తాత, అమ్మమ్మ, పిన్ని, బాబాయి, తాతయ్య (తండ్రికి తండ్రి)లుగా సమాజంలో ఈ పిల్లవాని భద్రత కల్పించి పెంపకం చెయ్యడానికి ముందుకు వచ్చే వెధవ ఎవరూ ఈ నాటి వరకు భూప్రపంచంలో పుట్టి ఉండలేదు. ఆఖరికి అతడి తండ్రి కూడా నేనితడికి తండ్రిని వీడు నాకంటి వెలుగు అని ఒప్పుకోడానికి సిద్ధపడడు. ఇంకా అంతకన్నా కడువిచారకర ఫలితం ఏమంటే ఈ అక్రమ సంతానానికి తల్లి కూడా ఈ భారాన్ని మోస్తూ సమాజం ఎదుటికి రాజాలదు. ఈ విశిష్టత సక్రమంగా వివాహం ద్వారా పుట్టిన సంతానానికే దక్కుతుంది. రెండు కుటుంబాలూ ఎటువంటి బయటి ఒత్తిడులు లేకుండా ఎంతో ప్రేమ, సంతోషాలతో ఏదో ఒక విధమైన బంధుత్వాన్ని వెల్లడిస్తాయి. ఈ పిల్లవాడు పుట్టిన లగాయితు మరణం వరకూ అన్ని

రకాల సంరక్షణకు సిద్ధపడతాడు. చేసుకోవాలన్న ఆపేక్ష ఉండీ, వివాహం జరగకపోవడం అనేది వేరేవిషయం. అయితే ఆయన (సల్లం) మనిషి అవివాహితుడుగా ఉండకూడదు అన్న విషయాన్ని నొక్కి చెప్పారు.

ఒకచోట మరో విషయం తెలిసింది. అదేమంటే వివాహం చేసుకోవడం వలన షైతాను ఓటమి పాలవుతాడు. చెడునడతను వ్యాపింపజేయలేక పోయానే అని విచారిస్తాడు. తరువాత ఏ విధంగానైనా భార్యాభర్తలలో తలం పులు పెట్టే ప్రయత్నం చేస్తాడు. జంటల మధ్య తగవులు పెట్టడం షైతాను పని.

ఇంకా వినండి, నికాహ్ జీవితం గడిపే సిలబస్‌లలో సగభాగంగా చెప్ప బడింది. అంటే నికాహ్ చేసుకున్నవారు వందమార్కులు ప్రశ్నపత్రంలలో యాభయి మార్కుల పేపర్‌ను ఆన్సర్ చేసినట్లు. అతడికి థర్డ్ డివిజన్‌లు పాస్ కావడం ఎంతో కష్టం అనిపిస్తుంది.

ఇంకా వినండి, విశ్వాసం సంపూర్ణం కావడానికి నికాహ్ సగం రూపం. ఎలా అంటే (హయా) లజ్జ సగం విశ్వాసం అని ప్రవక్త (స) పలికారు. వివాహం చేసు కోవడం వలన లజ్జ భద్రతను పొందుతుంది. లజ్జకు వ్యతిరేకంగా పూనుకునేది వివాహకొనివారే లేక ఒక భార్యతో సంతృప్తి చెందనివారే.

ఇకచాలు. ఖుర్‌ఆన్, సున్నత్‌లలో మరిన్ని ఆదేశాలు లభిస్తాయి. ఈ వ్యాసాన్ని మరింత సాగనీయకండి. ఇస్లాం భర్తపై ఎటువంటి బాధ్యతలు మోపుతుందో చూడండి. మరో విధంగా చెప్పాలంటే ఇస్లాం పురుషుడ్ని నిర్బంధిస్తుంది. స్త్రీని గృహసామ్రాజ్ఞిగా చేయగోర్తోంది. ఖుర్‌ఆన్‌లో ఆదేశాలు ఉన్నాయి. నమూనా ప్రవక్త (సల్లం) నుండి తీసుకోండి, విషయం అప్పుడే సంపూర్ణమవుతుంది. విషయాన్నంతటికీ ఒక క్రిములు వినండి.

## నికాహ్ ఆవశ్యకత

యువకులారా! మీలో వివాహ బాధ్యతను నిర్వహించే సత్తా గలవారు నికాహ్ చేసుకోవాల్సిందే. ఎందుకంటే నికాహ్, చూపులను క్రిందికి వచ్చేలా చేసి మర్మంగాన్ని రక్షిస్తుంది. (అంటే దృష్టి పెడత్రోవల వంకకు చూడకుండా ఆపుతుంది. ఉద్రేకాన్ని అదుపుతప్పనీయకుండా ఉంచుతుంది). నికాహ్ బాధ్యతలను మోసే అవకాశం లేనివారు ఉద్రేకాన్ని అణచుకోవడానికి ఉపవాస్తాలు ఉండాలి. (బుఖారీ, ముస్లిం గ్రంథాలలో హజ్రత్ అబ్దుల్లా బిన్ మసూద్ (రజి) ఉల్లేఖనం)

## భార్యను ఎంపిక చేసుకోవడం

నాలుగు విషయాలను దృష్టిలో ఉంచుకుని స్త్రీని వివాహం చేసుకోవడం జరుగుతుంది. ఆమె ఆస్తి పాస్తులు చూసో, ఆమె వంశం గొప్పతనాన్ని చూసో, ఆమె అందచందాలు చూసో, ఆమె గుణగణాల్ని చూసో చేసుకుంటారు. నీవు గుణగణాలు గల స్త్రీని అన్వేషించు. నీకు మేలుజరుగుతుంది. (ఉల్లేఖకులు హజ్రత్ అబూహురైరా (రజి), బుఖారీ, ముస్లిం గ్రంథాలలో)

## ధార్మికురాలయిన భార్య

స్త్రీని ఆమె అందచందాలు చూసి  వివాహమాడకండి. ఆమె అందం ఆమెను నాశనం చేయవచ్చు. ఇంకా ఆమె ధనవంతురాలని ఆమెను వివాహమాడవద్దు. ఆమె ధనం అవిధేయతకు లోనుచేయవచ్చు. మీరు ఆమెలో ధార్మికతను చూసి పెళ్ళి చేసుకోండి. ఆమె ఎంత కారునలుపు రంగుగల సేవకురాలయినా సరే. అల్లాహ్ దృష్టిలో కులీనురాలు, ఎర్రగా బుర్రగా ఉండే స్త్రీకన్నా ఆమె ఉత్తమం. (ముత్తఫిఖున్ అలైహ్)

## ధార్మికుడయిన భర్త

ఎవరయినా ఒక వివాహ సంబంధం తెచ్చినప్పుడు అతడి ధర్మం, అతడి

గుణగణాలు నీకు నచ్చినట్లయితే అతడితోపెళ్ళి జరిపించెయ్. నీవు గనక అలా చేయకపోయినట్లయితే భువిలో ఉపద్రవాలు, గొప్పదోషం జనిస్తాయి.

(తిర్మిజీ షరీఫ్)

## నికాహ్ విధానం

సంబంధం ఖాయపర్చుకున్న తర్వాత ఒక సమూహంలో లేదా కనీసం ఇద్దరు పురుషుల్ని సాక్షులుగా పెట్టుకుని భార్యభర్తలు పవిత్ర ఒప్పందం చేసుకుంటారు. అటువంటి సందర్భంలో మహాప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం ఒక ఖుత్బా (ప్రసంగం) చేసేవారు. దాని భావం సులభవాక్యాలలో వినండి:

"కృతజ్ఞతలు, ప్రశంసలు అల్లాహ్ కోసమే. మేమూ ఆయన్నే సహాయం కోసం వేడుకుంటున్నాం. ఆయన్ని మోక్షం కోసం అర్థిస్తున్నాం. మనస్సులోని దోషాల నుండి మనల్ని అల్లాహ్‌కు సమర్పించుకుంటున్నాం. ఎవరికైతే అల్లాహ్ రుజుమార్గం చూపుతాడో వారిని ఎవరూ దారితప్పించలేరు. ఆయన సన్మార్గం చూపదల్చుకోని వారికి ఎవరూ సన్మార్గం చూపలేడు. ఇంకా అల్లాహ్ తప్ప ఆరాధ్యుడు ఎవరూ లేరని నేను సాక్ష్యమిస్తున్నాను. మరియు ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వసల్లం) దేవుని దాసులు మరియు ప్రవక్త అనీ సాక్ష్యమిస్తున్నాను.

ఇవి వివాహ సందర్భంలోని పదాలు. ఇందులో ధర్మం పూర్తిగా ఇమడ్చబడి ఉంది. ఈ సందర్భంలో దైవానికి కృతజ్ఞతలు చెల్లించడం, షైతాను నుండి రక్షించబడేందుకు అల్లాహ్ ఆశ్రయం అన్వేషించడం మనసులో రేకెత్తించబడే దోషాల నుండి కాపాడుకోవడానికి అల్లాహ్ శరణు వేడటం ఇంకా!

అల్లాహ్ అయితే సన్మార్గాన్ని ప్రకటించి ఉన్నాడు ప్రవక్త (సల్లం) స్వయంగా దాన్ని పూర్తిగా ఆచరించి చూపారు. ఇక ఈ హితబోధను వ్యతిరేకించినవాడే దురదృష్టవంతుడు.

దైవప్రవక్త సల్లల్లాహు అలైహివసల్లం ఇదంతా వివరించిన తర్వాత ఇలా సూచించారు:

"నికాహ్ నా సున్నత్‌లలోనిది. దానిని ఆపేక్షించిన వాడు నా సంబంధీకుడు."

చూడండి, ఇస్లాం వివాహాన్ని ఎంత పవిత్రవంతంగా చేసిందో, దాని స్థానాన్ని ఎంత ఉన్నతం చేసిందో ఆ తర్వాత ఖుత్బా (ప్రసంగం)లో కొన్ని ఆయతులను పఠించేవారు. వాటి భావం ఇలా ఉంది:

"విశ్వాసులారా! దైవాగ్రహం నుండి కాపాడుకునే చింత కలిగి ఉండాలి. జీవితంలో ఆఖరి క్షణం వరకూ దైవాదేశాలను శిరసావహిస్తూ ఉండాలి. (అల్లాహ్ పవిత్రుడు. దీని అర్థం పెళ్ళిచేసుకోవడం ద్వారా మనిషి దైవాగ్రహం నుండి కాపాడబడగలడు. అతడు దుశ్చేష్టలకు దూరంగా ఉంటాడు అన్న మాట). ఇంకా ఇలా పలికాడు:

"మానవులారా! మీ ప్రభువుకు భయపడండి. ఆయన మిమ్మల్ని ఒకే ప్రాణి నుండి పుట్టించాడు. అదే ప్రాణి నుండి దాని జతను సృష్టించాడు. ఇంకా ఆ జంట ద్వారా ఎంతో మంది స్త్రీ పురుషులను అవనిలో వ్యాపింపజేశాడు. ఏ దేవుని పేరు చెప్పుకుని మీరు మీ హక్కులను కోరుకుంటారో, ఆ దేవునికి భయపడండి. (మేము వివాహాన్ని పవిత్ర ఒప్పందం అనడంలోని ముఖ్య విషయం ఇదే. మనిషి దైవాన్ని సాక్షిగా చేసుకుని వివాహం చేసుకుంటాడు. అందుకు భిన్నంగా దుశ్చేష్టలో షైతానీ గుణం ఉంటుంది. ఈ తేడాను డాక్టర్ ప్రమీలా కపూర్‌ను కలుసుకున్న యువతి అర్థం చేసుకోలేకపోయింది)

ఇంకా చెప్పబడింది, "బంధువుల హక్కులను గౌరవించండి. అల్లాహ్ మిమ్మల్ని గమనిస్తున్నాడనే విషయాన్ని గుర్తుంచుకోండి."

"స్పష్టంగా తేలిన విషయమేమంటే మీరు బంధుత్వం నెరపుతూ ఉంటే అల్లాహ్ మిమ్మల్ని అన్నివేళలా గమనిస్తూ ఉంటాడు. మీలో ఎవరు దౌర్జన్యా

నికి పాల్పడతారో, వారు భర్త అయినా, భార్య అయినా దాని గురించి ప్రశ్నించడం జరుగుతుంది.

## ఇస్లాంలో వివాహానికి తప్పనిసరి అయిన విషయాలు

1) స్త్రీ పురుషుల అంగీకారం లేకుండా పెళ్ళి చేయడం ధర్మసమ్మతం కాదు. స్త్రీ ముందుగా అనుమతి ఇవ్వాలి. పురుషుడు అంగీకరించాలి. అప్పుడు పెళ్ళి జరిపించవచ్చు.

2) స్త్రీ నుండి అనుమతి పొందే విషయంలో పురుషులలో కనీసం ఇద్దరు సాక్షులు ఉండాలి. స్త్రీ ఇందుకు అనుమతించింది అన్న నమ్మకం వారికి కలగాలి. సాక్షులు లేకుండా కూడా వివాహం జరుగదు.

3) మహర్ (స్త్రీ ధనం) పరిమాణం కూడ స్పష్టం చేయబడాలి. (వివాహ షరతులలో నుండి) 'ఆ షరతు దేని ద్వారా అయితే మీరు స్త్రీల శీలరక్షణకు రక్షకులుగా అవుతారో అది పూర్తి చేయబడటానికి ఎక్కువ అర్హత గలది అన్నారు.

మహాప్రవక్త సల్లల్లాహు అలైహి వసల్లం (గమనించండి, రక్షకుడు అన్న పదం ఉపయోగించారు. మరి వ్యభిచారానికి పాల్పడనప్పుడు కూడా దానికేమయినా హామీ ఉందా?

4) వలీమా విందు కూడా చెయ్యండి. అయితే వలీమా విందు ఫర్జ్ (విధి) కాదు. ఈ విందు భార్యను ఇంటికి తీసుకువచ్చినప్పుడు ఆమె గౌరవార్థం ఇవ్వ బడుతుంది. ఒకవేళ స్థోమత లేకపోయినట్లయితే తప్పనిసరి అతడికి (వాజిబ్) కాదు (వ్యభిచారానికి పాల్పడినప్పుడు కూడ స్త్రీకి ఈ గౌరవం లభిస్తుందా?)

వలీమా విందులో సంపన్నులు ఎటూ ఆహ్వానింపబడతారు. కాని బీదలను

పిలువకుండా ఇవ్వబడిన విందులోని భోజనం హేయమైనది. ఇంకా వలీమా విందును అంగీకరించని వారు ప్రవక్త (సల్లం) పట్ల అవిధేయులే.

అంటే గౌరవప్రదం అయిన ఈ విందులో సంతోషంగా పాల్గొనాలని దీని భావం.

## హక్కులు - బాధ్యతలు

భార్యల హక్కులు: భార్యపై భర్తకుగల హక్కు, అతడు భుజించినప్పుడు భార్యకూ తినిపించాలి. తాను ధరించినప్పుడు, భార్యకూ ధరింపచేయాలి. ఆమెను ముఖంపై కొట్టకూడదు. ఆమెతో శాపనార్థాల పదాలు పలక్కూడదు. ఇంకా ఆమెతో సంబంధం మానుకుంటే ఇంట్లోనే ఉంచాలి. (అబూదావూద్)

- భార్య స్వార్జితంగా ఏమయినా సంపాదిస్తే ఇది ఆమె స్వంత ఆస్తి. దానిని భార్య అనుమతి లేకుండా భర్త తీసుకోజాలడు.
- భర్త ఏదయినా సొమ్ము లేదా నగలు ఇవి నీవి అని ఆమెకు ఇచ్చి నట్లయితే అది భార్యకే చెందుతుంది. భార్య అనుమతించనిదే భర్త కూడా దానిని తీసుకోలేడు.
- మహర్‌గా ఇల్లు గానీ, నగలు గాని, ఏదయినా స్థలం గాని ఇవ్వబడితే అది భార్య ఆస్తి అవుతుంది.
- భార్య భర్త యొక్క తర్కాలో భాగస్వామి.
- భార్యకు భర్త వలన భరించరాని ఆరోపణ కలిగి ఉంటే, ఖులా చేసుకో వచ్చు. (అంటే భార్య భర్త నుండి వేరయిపోవచ్చు)
- ఈ వాజిబ్‌ల తర్వాత ప్రవక్త (సల్లం) మరికొన్ని ఉపదేశాలు ఇలా చేశారు:
- ఉమ్ముల్ మోమినీన్ (రజి) వద్దకు మదీనా స్త్రీలు తమ భర్తలు తమను దెబ్బలు కొడుతున్నారని ఆరోపణలు చేశారు. ఆయన (సల్లం) అదివిని

ఇలా సెలవిచ్చారు; "నా భార్యల వద్దకు చాలా మంది స్త్రీలు తమ భర్తలు తమను కొడుతున్నారని ఆరోపించారు. ఇటువంటి భర్తలు చాలా చెడ్డవారు."

ప్రవక్త (సల్లం) ఇలా అన్న తరువాత భర్తలు భార్యలను కొట్టడం మాని వేశారు. ఆ తరువాత స్త్రీలు సాహసవంతులు అయిపోయారని ఉల్లేఖనాల ద్వారా తెలుస్తోంది.

- మనిషిని పాపిగా చెయ్యడానికి అతడు పోషించేవారిని వ్యర్థపరచడం చాలు. (ఈ ఉపదేశంలో భార్యాపిల్లలు, బానిసలు చేరి ఉన్నారు.)
  (అబూ దావూద్, అబ్దుల్లా బిన్ ఉమర్ (రజి))

భర్త హక్కులు: భార్యపై భర్తకు గల హక్కు ఏమంటే, భార్య భర్త యొక్క ప్రక్క(Bed)ను మలిన పర్చరాదు. దీని అర్థం, పరాయి పురుషుని నుండి రక్షించబడి తన శీలరక్షణ చేసుకోవాలి. భర్త చెప్పినట్లు భార్య నడుచుకోవాలి. భర్తలేని సమయంలో తన ఇంటిని సంరక్షించుకోవాలి. ఈ వాజిబ్ విషయాల తర్వాత ప్రవక్త (సల్లం) స్త్రీలకు ఇంకా కొన్ని ఉపదేశాలు చేశారు.

- నఫిల్ ఉపవాసాలు, నమాజుల సందర్భంలో తమ భర్తల అవసరాలను దృష్టిలో ఉంచుకోవాలి. భర్త గనక నఫిల్ ఉపవాసాలు పాటించ వద్దని అంటే భార్య నఫిల్ ఉపవాసాలు పాటించరాదు.
- తన భర్త తన వంకచూసినప్పుడు తన భర్తను సుఖపెట్టే భార్య ఉత్తమ బాధ్యత.
- తన భార్యను నరకాగ్ని నుండి కాపాడటం ప్రతి భర్తకూ వాజిబ్ (తప్పని సరి). ఈ విషయం దివ్యఖుర్ఆన్ నుండి నిర్వహించబడింది.

## రెండు ప్రత్యేక విషయాలు:

1) ప్రవక్త (సల్లం) ఒక హదీసులో ప్రవచించారు; "భార్యపట్ల ఉత్తమ

రీతిలో వ్యవహరించే వాడే ఉత్తముడైన భర్త. నేను భార్యల పట్ల అందరికన్నా ఎక్కువ ఉత్తమరీతిలో వ్యవహరించేవాడిని.

2) ప్రాపంచిక వస్తుసామాగ్రి (అవసర వస్తువులు)లో భార్య అన్నింటికన్నా గొప్పవరం.

ఈ ఇస్లామి సిద్ధాంతం మరియు దృక్పథం, మేము డాక్టర్ ప్రమీలా కపూర్ ఎదుట ఇంత కు ముందు పేర్కొన్నట్లుగా చెప్పిన యువతికి తెలిసుంటే బాగుండేది. లేక డాక్టర్ గారి పఠనం విస్తృతమయి ఆమెకు ఆ యువతికి వివరించగలిగేవారు. అప్పుడు డాక్టర్‌గారు వ్యక్తపర్చిన అభిప్రాయాలకు నోరెళ్ళబెట్టే పనే ఉండదు.

## నికాహ్ ప్రాముఖ్యత

ఈ సందర్భంగా మేము రాయవలసిందంతా రాశాము. (క్రీ.శే.) అబ్దుల్ కరీం పారేఖ్ గారికి వ్యాసం ఒకటి 'నికాహ్‌కీ అహ్మియాత్' అన్న శీర్షికతో మా ఎదుటకు వచ్చింది. దానిని కాస్త కుదించి, చేర్చడం జరిగింది. ఈ వ్యాసం నికాహ్ ప్రాముఖ్యతను చక్కని రీతిలో విశదపరుస్తోంది.

ఇస్లామీ షరీఅత్‌లో నికాహ్ అంటే అర్థం పరస్పర ఒప్పందం, ప్రమాణం చేసుకోవడమే. ఒక స్త్రీ కేవలం ఒక్క పురుషుని కోసమే. ఈ సిద్ధాంతాన్ని ఎవర యినా అంగీకరిస్తే, సంతతి బాధ్యత మోసేది నికాహ్, కేవలం నికాహ్ మాత్రమే నని ఒప్పుకోవాల్సి ఉంటుంది. అందులో స్త్రీ ఏకకాలంలో కేవలం ఒకే భర్తకు భార్య అవుతుంది. అది తప్ప మరే విధానమూ ఉండనే ఉండదు.

ఒక భార్య ఒకే భర్తకు చెందుతుంది అన్న సిద్ధాంతం ప్రపంచంలో నేటికీ ఆచరింపబడుతూ ఉంది. తాము మతం అంటూ ఏదీ లేనివారు, నికాహ్ పవిత్రతను వ్యతిరేకించేవారు కూడా తమకు తండ్రి ఒక్కడే ఉండాలని ఆపేక్షి స్తారు. ఇటువంటి వారందరూ తమ భార్యలపై దాంపత్య హక్కు ఏకకాలంలో తమపై తప్ప మరెవరి హక్కునూ అంగీకరించరు.

ఈ సిద్ధాంతం వారి ప్రమత్తస్థితిలోనూ సురక్షితం మరియు గౌరవ నీయము. ప్రపంచ మానవులకు మార్గదర్శకత్వం నెరపేందుకు దైవంచే పంప బడిన ప్రవక్తలందరూ భార్యలు, సంతానం కలిగిన వారేనన్నది అంగీకరింపబడ్డ విషయమే. ఇలా సెలవియ్యబడింది:

> "ఓ ముహమ్మద్ (సఅసం) నీకు పూర్వం కూడా మేము ప్రవక్త లను పంపాము. వారందరికీ భార్యల్ని, సంతానాన్ని కూడ అనుగ్రహించాము." **(అర్రాద్:38)**

ఇందులోని రెండవ విషయాన్ని దివ్యఖుర్ఆన్ వివరించింది. దీనిని మత చరిత్రలోనూ కొన్నిచోట్ల విస్మరింపచేయబడింది.

ఈ దివ్యసందేశం ద్వారా అందరికన్నా గొప్ప శీలవంతులు, అందరికన్నా గొప్పవారయిన దైవప్రవక్తలు నికాహ్ చేసుకున్నారని తెలుస్తోంది. ఈ కారణం లోనే చిట్టచివరి ప్రవక్త, ప్రవక్త పదవిని అంతం చేసిన వారు అయిన మహాప్రవక్త ముహమ్మద్ సల్లల్లాహు అలైహి వలస్లం ఇలా సెలవిచ్చారు:

"నికాహ్ నా సంప్రదాయం."

దీనినిబట్టి తఖ్వా (దైవభీతి పరాయణత) ధార్మికత, గాఢమయిన మత వైఖరిలోనూ సత్యాసత్యం అనేది లేదు అని రుజువు అవుతోంది. ఏ లక్ష్యం కోసం ఈ ప్రపంచం ఉనికిలోకి తీసుకురావడం జరిగిందో దానికోసం నికాహ్ మాత్రం ఎంతో అవసరం.

ఇక మతం పేరుతో తమ .......... బిగించి కట్టుకుని వైరాగ్యం, అశ్రమ జీవితం అన్న తప్పుడు విధానాన్ని ప్రజలకు నేర్పుతూ వచ్చారో వారిలో చాలా మంది ఒకవైపు స్త్రీ పట్ల ద్వేషం, నికాహ్‌కు దూరంగా ఉండే పాఠాలు బోధిస్తూ వచ్చినవారే, మరో వైపు తామే ఉద్రేకాలను అదుపులో పెట్టుకోజాలక పోయారు. తాము ఏదైతే చెయ్యకూడదని ప్రమాణాలు చేసుకున్నారో అదంతా చేశారు. ఇటువంటి వారు మానవ చరిత్రలో కోకొల్లలు.

ఈ కారణంగా చేతనే దైవగ్రంథంలో ఆదేశం ఇవ్వబడింది. "ఈ స్వభావం దైవం ఏర్పాటు చేసినది. ఆ స్వభావానికే కట్టుబడిందట. ఇందులో ఎటువంటి మార్పూ చెయ్యకండి. సహజ స్వభావం పట్ల పోరాటం సాగించి తప్పుడు సిద్ధాంతాల ప్రచారకర్తలు అయిన వారు, స్వయంగా తాము స్వభావాన్ని అంతం చేసిన తర్వాత తాముగా పెనుగోతిలో పడకుండా ఉండలేకపోయారు.

## నికాహ్ అంటే ఏమిటి

ఒక స్త్రీ తన అంగీకారంతో, తన ఇష్టప్రకారం తనను తాను ఒక పురుషుని దాంపత్యబంధంలోకి సమర్పించుకుంటుంది. మన షరీఅత్ (ధర్మశాస్త్రం)లో ఏ అమ్మాయి పెళ్ళి ఆమె ఇష్టానికి వ్యతిరేకంగా ఎంతమాత్రం జరుగదు. సరిగ్గా పెళ్ళి సమయానికి అయినా అమ్మాయి తిరస్కరించినట్లయితే ప్రపంచంలోని ఏ శక్తీ, చివరకు ముస్లిం సమాజం అంతా ఏకమయినా కూడ, అందరూ కలసి ఆమెను బలవంతంగా 'నికాహ్' జరిపించే హక్కు లేదు.

> **"విశ్వాసులారా! స్త్రీలకు బలవంతపు వారసులు కావటం మీకు ఎంతమాత్రం ధర్మసమ్మతం కాదు." (అన్నిసా)**

స్త్రీ అంటే ఏదో వారసత్వపు ఆస్తికాదు. మీ అంతటిమీరు ఆమెకు అనుభవించడానికి. ఆమె స్వీయాభీష్టతా హక్కుగా స్వేచ్ఛాజీవిగా అంగీకరించబడింది.

ప్రవక్త (సల్లం) ప్రభవనానికి పూర్వం ఖుర్ఆన్ అవతరణకు పూర్వం స్త్రీ నడిబజారులో విక్రయించబడేది. బలవంతంగా ఆమె ఎవరికిపడితే వారికి భార్య కావలసి వచ్చేది. ఏ స్త్రీ ఎవరి చేతికి చిక్కితే ఒక్కతే ఆమె వారి ఆస్తి అయిపోయేది. మానవుల ఉనికి కోసం ఆధారం అయ్యే మేకలు, గొర్రెలలాగా బజారుల్లో విక్రయించబడేది.

స్త్రీ జనావళి యొక్క ఈ నిస్సహాయతను, దౌర్జన్యానికి గురికావడాన్ని అంతం చేసిన, సత్యధర్మం నికాహ్‌లో ఆమె అంగీకారం అవసరంగా,

తప్పనిసరి విషయంగా ఖరారు చేసింది. మానవజాతి స్త్రీలందరికీ స్వేచ్ఛా హక్కుల్ని ప్రసాదించింది. అదే విధంగా పురుషునికి కూడ అంగీకరించే లేక తిరస్కరించే స్వేచ్ఛను ఇచ్చింది. వ్యక్తిగత స్వేచ్ఛను స్త్రీ పురుషులిద్దరికీ సమానంగా అంగీకరించబడింది. వివాహానికి అంగీకారం ప్రకటించడం తప్ప, ఏక పక్షంగా, బలవంతంగా జరిగే వివాహాలన్నింటినీ చట్ట వ్యతిరేకంగా నిర్ణయించ బడింది.

ఈనాటి ప్రజాస్వామ్య యుగంలో దీన్ని పట్టించుకునేవారు లేకపోవచ్చు. కాని పద్నాలుగు వందల ఏళ్ళ క్రితం నాటి సమాజంలో ఇటువంటి, వ్యక్తి స్వేచ్ఛ గురించిన బహిరంగ ప్రకటన ఒక గొప్ప విప్లవాత్మక మరియు సంస్కరణాత్మక చర్య అని ఒప్పుకోక తప్పదు.

రెండు కుటుంబాలను పరస్పరంగా సమైక్య పర్చడానికి నికాహ్ ఒక గొప్ప బంధనం అయిపోతుంది. ఒకవైపుకు చెందిన అమ్మాయిలు నికాహ్ తర్వాత వధువులు అయివెళ్తారు. బంధుత్వం మరియు అత్తమామల ప్రేమనురాగాల మాధుర్యం గొప్ప అపురూప విషయం. ఎంతో దృఢమయిన ప్రేమకు కొలమానం బంధుత్వాలు వరుసల విశాల పరిధుల్లో నికాహ్ శుభం వలన విస్తరిస్తూ పోతుంది.

ఒక తండ్రి ఎటువంటి లాభాపేక్ష లేకుండా ఒక అమ్మాయిని పోషిస్తాడు. తరువాత బాగా ఆలోచించి ఒక పురుషునికి ఆమెను అప్పగిస్తాడు. ఈ సందర్భంగా వీడ్కోలు ఇచ్చే కూతురికి, నా బిడ్డ సంసారం చక్కబెట్టుకోవడంలో ఇబ్బంది పడకూడదని జీవితావసర వస్తువుల్ని ఆమెకు ఇచ్చే ప్రయత్నమూ చేస్తాడు. ఒక తండ్రి తన కూతురి కోసం చేసే గొప్ప త్యాగం ఇది.

సత్యధర్మం ఇందుకోసం అత్తవారింటి బంధుత్వానికి ప్రాధాన్యత నిచ్చి అత్తమామల్ని, తల్లిదండ్రుల సమానంగా నిలబెడుతుంది.

హిందూ మతంలోనూ తండ్రి కన్యాదానం చేస్తాడు. అంటే తన కూతురిని ఎటువంటి ప్రతిఫలం లేకుండా అల్లుడికి అప్పగిస్తాడు. ఇదీ ఒక మంచి కోణమే. దానం ఇచ్చేవాడి చెయ్యి పైకి, పుచ్చుకునేవాడి చెయ్యి క్రిందికే ఉంటాయి. దీని ప్రకారం అల్లుడి కన్నా మామకు విశిష్టత, హోదా పెరుగుతాయి. ఈ విషయం ఇస్లాం దృష్టిలో కూడ సక్రమమే.

- సమాప్తం -